

ఆర్యులారా నేనీనాటకమును [illegible] సం॥ రమునరచియింపంబూని కొలదికాలముననే బరిసమాప్తినొందించితిని నాకుసంస్కృతంబునగాని ఆంధ్రమునగాని పాండిత్యము లేకుండుటయు పండితప్రకాండుల సహవాసము చిన్నతనముననుండి లేకుంటయుం జేసి నారచనయందు స్ఖాలిత్యములుండకపోవు. పాండిత్యము పూర్ణముగా సంపాదించకయే కవిత్వమేల ప్రారంభించవలెనని కొందరియభిప్రాయమైయుండవచ్చును. తీయగాతీయగా రాగము దిద్దగాదిద్దగాగొప్ప అనునట్లే తప్పులతడికలో నాలుగల్లి నలుగురిలోపడినప్పుడుగదా లోపాలోపములు తెలియుటయు భాషాభివృద్ధి యగుటయు నని నేనీరచనకు బూనుకొంటినిగాని కేవలము పేరుసంపాదించుటకు మాత్రము కాదని అందదరికి విన్నవించుచున్నాడ. గుణగ్రహణపారీణులగు నోమిత్రులారా మరాళము పాలునీరుగలసిన పాలనేరీతిగ్రహించునో ఆరీతిని తాము తప్పొప్పులు గలయీగ్రంథమును గ్రహించి నన్నానందింప జేయుదురని వేడుకొనుచున్నాడను.

8-12-09, కొమరవోలు.

ఇట్లువిన్నవించు విబుధజనవిధేయుడు,
రాళ్ళబండి నాగభూషణము.

## ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

---

### పురుషులు.

శంకరుడు—కథానాయకుడు

హిమవంతుడు—పార్వతితండ్రి

జయశీలుడు—హిమవంతునిమంత్రి

నారదుడు—దేవఋషి

మహేంద్రుడు—దేవతలరాజు

దేవనంది—ఇంద్రసేవకుడు

బృహస్పతి—దేవగురువు

దేవలుడు—దేవదూత

కాముడు—కృష్ణునికుమారుడు

వసంతుడు—మన్మధునిమిత్రుడు

నంది—శంకరునిసేవకుడు

శిలాధరుడు—హిమవంతునిసేవకుడు

బ్రహ్మ

విష్ణు

సూత్రధారుడు

### స్త్రీలు

పార్వతి—హిమవంతునికూతురు (కథానాయిక)

మేనక—పార్వతితల్లి

వాసంతిక—వనదేవత

రంభ — దేవవేశ్య

రతి — కాముని భార్య

జయ
విజయ } పార్వతి చెలికత్తెలు

కౌశికి — హిమవంతుని యింటనున్న యొక యోగిని

నటి

ఇంకను నిందు విద్యాధరులు, కులపర్వతములు, భూతము, వృద్ధాంగనలు సందర్భానుసారముగా వత్తురు.

---



శ్రీరస్తు.

దుర్గాత్రిపురసుందరీసహాయము.

# మహీధరాత్మజా పరిణయము

—ooo—

## నాంది.

ఉ॥ శ్రీరమణీమణీవిమలచిత్తసరోరుహచంచరీకుడం
భోరుహవైరిశేఖరుడు భూతగణేశుడు వాసవాదిబృం
దారకసేవితుండు గజదానవసంహరణుండు శైలసం
చారుడు భూరిసాంద్రగుణశాలి యశోనిధి మమ్ము బ్రోచుతన్

(సప్రమాణంబుగ పుష్పాంజలిం బట్టి)

మ. ఎవడీలోకములన్ దలంపునను దా సృష్టించి రక్షించునో
ఎవడవ్యాజకృపాగరిష్ఠుడగునో ఎవ్వాడనాద్యంతుడో
ఎవడీయద్భుతమైనసృష్టికృతికిన్ ఎల్లప్పుడున్ సాక్ష్యమా
భవుడున్ సద్భవనేశుడీశ్వరుడు భాస్వత్ప్రీతి మిమ్మేలుతన్.

(అని సభ్యులకు పుష్పాంజలిం జల్లి)

(తనలో) ఆహా ఏమి నాయదృష్టము నేటిదినంబున సకలకళా కుశలులగు మహాజను లెందరెందరో మాయాటపాటల

సూత్ర-విను తే.గీ. సరసులుసుపండితేంద్రాదిసకలజనులు
నరయవచ్చుటగాంచినేనంబుజాక్షి
నవరసస్ఫూర్తియుబునయీనాటకంబు
నాడనెంచితివీరికాహ్లాదమొదవ.

నటి-అటులయినయుక్తమే

సూత్ర-(నటినిచూచి) ఓసీయీమహీధరాత్మజాపరిణయప్రసంగ
మునుగూడ మనస్సులోవిచారించుచున్నదానివలె గన్పించు
చున్నావేమి

నటి-ఈపరిణయప్రసంగముచే మనబాలబాలచండిక కనురూప
వరలాభమహోత్సవమెట్లు కలుగునని నిరంతరము నాహృ
దయము చింతాకులముగుచున్నది

సూత్ర-చెలీవిచారింపకుము ఏమనిన

చం. చెలులనభీష్టభర్తలతో జేరుపదత్నమియం బెరింగియా
నలువ యొగూర్చుచుండుతననై పుణతన్నున మొప్పనట్టులా
సలిలజనేత్రపార్వతినిజకగ్గనాహరుతోడగూర్పదా
చెలువమిమీరయత్నమును జేసెడినారదమౌనివ్రాలెడిక్.

(అనియిరువురునిష్క్రమించుచున్నారు)

---



శ్రీరస్తు.

# మహీధర పౌత్రజా పరిణయము

## ప్రధమాంకము.

—oo:o:oo—

(అంతట నారదుఁడు గగనమార్గమున ప్రవేశించుచున్నాఁడు).

నార — హా ఈనిజకార్యసంఘటనమునందలి కుతూహలము జన్మమెత్తినదాదిగ మన్మనిశ్చయముగా విడువకున్న యది యేమనిన

చం. మునుసతి పేరదక్షునకు బుట్టినదై నిజభర్తృవైరినా
తనిత్యజియించి శైలకులదైవగృహంబునబుట్టె నాసతీ
మణికిహిమాచలంబునదసంబొనరించు మహేశుగూర్పనే
ననిమిషకార్యసిద్ధికయి యద్రికులాధిపు నొద్దకేగెదన్

(అనినిష్క్రమించుచున్నాఁడు)

(అంతట సభామంటపమున జయశీలుడనుమంత్రితో హిమవంతుడు ప్రవేశించుచున్నాఁడు)

హిమ — అమాత్యకులతిలకా అస్మద్బాహుసంపాలిత సర్వపర్వతసహాచక్రంబులో భూసురులత్యంబును నిగమాగమాపారవేదులగుచు సర్వయాగక్రియా కరణపాటవంబుచే జె

నొందుచు తత్తద్యాగాది సందీయమాన హావిర్భాగ సంజ
నిత ప్రమోదితే సఫలమనోరథులగుచుధనుంజయోద్భవక్షా
రబాధలనొందక సంతోషాయత్తచిత్తులై

శా. ప్రత్యూషంబును తెల్లవారుతరినిద్రంబాసిస్నానాదిస
త్కృత్యంబుల్నెరవేర్చివచ్చిహుతునిన్ గీర్తించిశ్రద్ధాళులై
నిత్యంబున్ దమవేదకార్యములసందేహంబులన్ దీర్చికొం
చత్యానందమునొందుచున్మిగులసత్యజ్ఞానులైయుండిరే.

జయ—తదావిధంబుననే ప్రవర్తిల్లుచున్నవారలు

హిమ—మంత్రిశేఖరా అస్మత్పరాక్రమ ప్రభాభాసమానాఖిల రాజ్యంబులో రాజులందరతిపరాక్రమవంతులై

మ. పరధాత్రీధవులందరిన్ దునిమిసర్వప్రాభవోపేతులై
ధరణీపాలనదక్షులైనియుతసద్ధర్మానాధ్యక్షులై
పరమానందముడెందమందునుదయింపన్ రాజ్యధర్మంబులన్
బరిశీలించుచునెల్లవేళలనుబ్రహ్మానందులైయుండిరే.

జయ—ఆలాగుననేయున్నవారలు

హిమ—వణిగ్జనంబులును తమనైసర్గిక వృత్తులగు కృషి వాణిజ్య వ్యాపారాదులయందు న్యాయంబుగవర్తింపుచు అస్మదాజ్ఞోల్లంఘనము శేయక నతిజాగరూకులై మెలంగుచున్న వారలే

జయ—తత్ప్రకారంబుననే యున్నవారలు

హిమ—మంత్రిపుంగవా మనరాష్ట్రంబున శూద్రజనంబులు

త్రైవర్ణికులకు విధేయులై బ్రాహ్మణ సేవకావృత్తి నొనరించు చు పురాణేతిహాస శ్రవణకుతూహలులై సుఖంబున్నవార లే

జయ—తద్విధంబున నే ప్రవర్తింపుచున్నవారలు

హిమ—అమాత్యవర్యా అస్మద్రాష్ట్రంబున ప్రతివర్షంబున మాసంబునకు త్రివర్షంబులు వర్షించుచు సర్వసస్యంబులు ఫలించికొరంతయనుమాట సినుమంతయును లేక ఆబాలాది సర్వజనంబులు తమహృదయంబుల నమందానందంబునొందు చు సుఖంబున్నవార లే.

జయ—దేవా దేవరసింహాసనం బధిష్టించి రాజ్యపరిపాలనం బొనరించుచుండ ప్రజలకుకొరంతయను మాటకూడకలదా వినుండు

గీ. ధరణివర్జితబాధయై దనరుచుండె
ప్రజలుఅన్యోన్యవైరముల్ బాయుచుండె
అలఘువిద్యావినోదులై యధిపులుబుధ
వితతిబ్రోచుచునుండెనుసతమునిజము.

హిమ—మంచిదిమదీయహృదయం బానందంబునొందినదిసీవంటి మంత్రిసత్తముండుండ రాజ్యంబున కొరంతలుగూడ వాటిల్లు నా మంత్రివరా నేడొకమహాకార్యమును గురించి దేవివైన మేనకతో యాలోచించవలసి యున్నది కావున యింకము ... నము కొలువుచాలింతము.

జయ—చిత్తము (అనిఅందరును నిష్క్రమించుచున్నారు)

(అంతట నారదుడు ఓషధీప్రస్థపుర సమీపమున ప్రవేశించి)

నార — (నలుదిక్కులఁ గలయజూచి) ఆహా యేమి ఈపుర వైభవము

సీ. మరకతమాణిక్యమౌక్తికవైడూర్యఫుల్లగోమేధికపుష్యరాగ
వజ్రప్రవాళాదివరరత్నములచేతఁబరిఢవిల్లెడిద్వారబంధములును
బంగారురంగారు శృంగారకుడ్యముల్ కిమ్మీరములుఁగలగేహములును
అధికోన్నతంబులై యాకాశమార్గము న్నిమ్ముచునుండెడి శిఖరములును
దివ్యభవనంబులకు ముందుఁ దేజరిల్లు। చల్వపందిరులునుఁగల్గి చెల్వముగను
దనరుయిప్పురవిభవంబుతథ్యముగను। నామనంబున కెంతో నానంద మొసఁగె॥

(అని పుర ప్రవేశమభినయించి ముందుకుఁ జూచి) అంతరిక్షము నొరయు శృంగముల తోడ నక్షత్రపథము నంటుచున్న యిది యే సకలకులాచలచక్రవర్తియగు హిమవానుని మేడ (అని లోపల ప్రవేశించి ఆకసమువంక జూచుచు) ఓయీ ద్వాస్స్థితా గిరీంద్రుఁ డెచ్చటనున్నవాడు ఆ! ఏమనుచున్నావు రాణియైన మేనకతోఁ గూడి నెద్దియో విచారించుచు లోపలి మంటపమున నున్నాడనియా అటులయిన కార్యము విన్నవించుటకిది తగినసమయమే (అని హిమవంతుని జేర నడచుచున్నాడు)

(అంతట హిమవంతుడు మేనక కొలదిపరిజనమును ప్రవేశించుచున్నారు)

హిమ — మనోహారీ కన్యాపితృత్వమెంతయు గృహస్థులకధికతర దుఃఖముఁ దెచ్చునుగదా మన బాలయగు పార్వతి పరిణయ యోగ్యురాలయ్యెఁగదా.

మేన — దేవా తామువలవిచ్చినట్లు మనబాలపెండ్లి యీడున కువచ్చినది.

హిమ — దేవీ ఇంకొకమాటవినుము.

తే.గీ. కమలవైరికిబహుళపక్షంబునందు
కళలుగ్రమముగక్షీణించుకరణినాకు
బాలయాగౌరికనురూపవరునిఁగూర్ప
జిక్కుచున్నది దేహంబు స్మేరవదన.

మేన — దేవా దివారాత్రములయం దీకార్యమునే విచారించుచున్న నాకుమాత్రము దేహమట్లుతోచుచుండలేదా.

హిమ — (ముందుకుజూచి) దేవీ వీణావిశారదుండగు నారదఋషీశ్వరుండిదేవచ్చుచున్నాడు వారికర్ఘ్యమునుఁగైకొనిరమ్ము.

మేన — చిత్తము (అనిఅట్లుచేయుచున్నది)

నార — (హిమవంతుని సమీపించుచున్నాడు)

హిమ — (లేచిదోసిలియొగ్గి)

చం. మునికులచంద్రపాపహరభూరితపోధనపుణ్యమూర్తిస
జ్జననుతకీర్తిపాత్ర భవసాగరతారణయానపాత్రమా
చనువుగనీదుపాదజలజంబులకుఁ బహుభక్తితోడవం
దన మొనరించుచుండితిసతంబుత్రిలోకవిహారనారదా.

(అని నమస్కరించుచున్నాడు)

నార — మహీధ్ర రాసీకు స్వాగతము.

హిమ — (పీఠమునుజూపి) మహాత్మా మణిమయంబగు నీపీఠంబ లంకరింపుము.

నార — మంచిది (అని అట్లు చేయుచున్నాడు)

హిమ — (అర్ఘ్యమును సమర్పించుచున్నాడు)

నార — (గ్రహించుచున్నాడు)

హిమ — (సంతోషముతోఁ జేతులు మోడ్చి)

తే గీ. అఖిలకోర్కెలవిడనాడియధికముగను
దపమునొనరించిభగవంతుకృపనుఁగాంచి
దనరుమీవంటిమునులసందర్శనంబు
నల్పపుణ్యులమాకుమాకునబ్బుటెట్లు

నార — రాజా చతురాశ్రమోపకారకులగు మీవంటిగృహస్థుల ను నిస్పృహులైనను మావంటివారు చూడతగినదే.

హిమ — తాముశలవిచ్చినదియనుగ్రాహ్యవిషయము.

నార — అనుగ్రాహకు ననుగ్రాహ్యతయందు సందేహమేమి కలదు మఱియు పుణ్యభూమివగునీవు మాకుదర్శనీయు డవే ఏమనిన

ఉత్సాహము. సర్వలోకమాన్యయైనజహ్నుపుత్రిమున్ను యీశ శర్వుశిరముడిగ్గినీదుశృంగమపల్లబక్కడాక

చెల్వముగను జేరెననుటఁ జేతగాదెనాపెని
సర్వభువనపావనయునిసకలజనులుపొగడుటల్.

హిమ—మునీంద్రా తమపాదారవింద శేవకుడగు ఈదీనునిఁ
దామింతగా స్తుతింపనేల.

నార—రాజా నీకు

ఆ. వె. అనుపమానకళలకాస్పదులిద్దరు
గంగగౌరులనగగలరుసుతలు

హిమ—అవునిది నిజమే

అందుగంగముక్కుయనురూపవతిసింగా
వారిరాశిప్రేమువడసెగాదే.

హిమ—ఇదియునునిజమే

నార—అందునీరెండవకుమారి నెవ్వరికీయనుద్దేశించినావు

హిమ—మునీంద్రా ఈసంగతినేవిచారించుచు నామనంబత్యం
తమనుతాపంబొందుచున్నయది

నార—రాజానీకుమారికి సర్వజగద్భర్తభర్తకాగలడు

హిమ—ఆ సర్వజగద్భర్తయెవరో తామేశలవీయసమర్థులు

నార—(తనలో) ఇప్పుడితని కప్పరమేశ్వరుని మాటచెప్పకసా
మాన్యవాక్యములచే వెళ్ళఁబుచ్చెదను (ప్రకాశముగా)
రాజా మేమీవృత్తాంతమును దివ్యదృష్టిచే గనుంగొని నా
రము అభేదనిన నీకుమారి లోకాతీతుడగు నొకవరునిబొం

దగలదు ఇట్టివానివని విశేషించి తెలిసికొనుము

హిమ—మునీంద్రా లోకాతీతుడనుమాటచేతనే ధన్యుడనైతిని

నార— మహీధరేశ్వరా

అ. వె. నీసుతామణిమునునీపుణ్యవశమున
నాదిశక్తిధరణినవతరించె
అనుపమానకళలకాస్పదమగునీపె
దరుణులందరివలెఁదలపవలదు॥

హిమ—తమయాజ్ఞానువర్తినయ్యెదను

నార—మీయభివృద్ధికొరకిఁకొకహితమునుఁ గూడఁజెప్పెద
వినుము

హిమ—శెలవీయబడుగాక

నార—ఉ. ఎవ్వఁడు వాల్చునీభువన మెల్లనుగూపము లెన్నిదింటిచే
యెవ్వఁడులోచనత్రితయమేర్పడెవెల్గులు నెల్లఁగూర్పఁగా
యెవ్వఁడు దేవతాసమితి నెన్న గనీశ్వరశబ్దవాచ్యుఁడో
యవ్విధుమౌళినీచరియలందుదపంబొనరించుచుండెఁగా.

హిమ—అవును చేయుచున్నాడు.

నార—అందుచేతస్వయముగా నీయొద్దకువచ్చిన నాయిందుశే
ఖరుంబూజింపుమని నీకుమారికాజ్ఞయిడుము.

హిమ—చిత్తము అటులనే చేసెదను

నార—(స్వగతము) విత్తనమునాటబడినది జరుపదగిన కా

ముసామాన్య వాక్యములచే వెళ్ళఁబుచ్చితిని అందుచేతనే నింక బోయెదను (అనిప్రకాశముగా) మహీంధ్రానే చెప్పినట్టు తప్పక నప్పరమేశ్వరుని పూజింపుమని నీకుమారికిఁ జెప్పుము నే నేగుచున్నాను.

(అనినిష్క్రమించుచున్నాడు)

హిమ — (నారదునిఁజూచి)

తే గీ. పగటిపూటనె దనదనుప్రభలచేత
నాల్గుదిశలందు వెన్నెలనలరఁజేసి
నాకమున కేగుచున్నాడు నారదముని
బరిఢవిల్లంగ యాశీతభానుపగిది.

(అని మేనకతో) దేవి నారదమౌని వాక్యములాలించితివా

మేన — లోకాతీతుడను మాటవింటిని

హిమ — (స్వగతము) లోకాతీతుడను మాటను బట్టియు జరుప దగినకార్యమునుపదేశించుటఁబట్టియు నాకూతునకీశ్వరుడే భర్తయగునని సూచింపఁబడుచున్నది మేనకతో మనోహారీ గౌరిని ఈశ్వర పరిచర్య జేయుటకు నియోగింతమురమ్ము

మేన — చిత్తము (అని అందరునిష్క్రమించుచున్నారు)

ఇది ప్రథమాంకము.

---



శ్రీరస్తు.

# మహీధరాత్మజా పరిణయము

## ద్వితీయాంకము.

—ంఽంఽంఽ—

(అంతట వాసంతికయను వనదేవత ప్రవేశించుచున్నది)

వాసం—తపోనియమమందుండిన యిందుధరునకు నందనవనమునుండి పూజాపుష్పములు గైకొని రమ్మని సుందరశరచ్చంద్రమౌళి పదారవిందవందితుండగు నందీశ్వరుని చేత నాజ్ఞాపించబడితినిగదా అందుచేత తత్ప్రకారమునఁ బ్రవర్తించెదను (అనిముందుకునడుచుచున్నది) అంతటరంభ ప్రవేశించుచున్నది

రంభ—దురాత్ముండగు తారకాసురుని బందీగ్రహణభయముచేత నచ్చరులు మేరుపర్వతగుహలలో డాగియున్నారు నేనో కుబేరనందనుండగు నలకూబరుని విడచి యొకనిముసమైనను బ్రాణములు నిలుపజాలక పోవుటచేవానియొద్దకుఁ బోవుచున్నాను (అనిముందుకునడచుచున్నది)

వాసం—(రంభనుజూచి) అదిగో ప్రియసఖియగు రంభయిట్లే వచ్చుచున్నదిఆమెనుసమీపించెదను(అనిఅట్లుచేయుచున్నది

రంభ—(వాసంతికనుజూచి) ఓహో ప్రియసఖియగు వాసంతి

కయిదిగో సఖీమణికి జయమగుగాక.

వాసం—సఖీనీ వెచ్చటికేగుచుంటివి

రంభ—తారకాసురబందీగ్రహణ భయముచే శంకితులగు న
చ్చరులు మహామేరుగుహాలలో డాగియున్నారు.

వాసం—అవును వాడంతటి దుష్టశీలుండేయగును.

రంభ—మన్మనోహరుండగు నలకూబరుని జూడక నొకత్రుటి
యైనను బ్రాణములు నిలుపజాలని సంగతి నీవెరుగుదు
వుకదా.

వాసం—అవునది మున్నె యెరుగుదును ఈభూమండలమున
మీయిరువురి యన్యోన్యానురాగము సుప్రసిద్ధమేకదా.

రంభ—తుంటవిల్తుని వింటనుండి అతిరభసంబునం బయలువెడ
లు బాణములుపీడించగా మనసు కలిగి ప్రియసఖులతో జెప్ప
కయే కుబేరనందనుని గలయబోవుచున్నాను

వాసం—అట్టి మీయన్యోన్యానురాగమునకిట్టి వ్యాపారముం
దగును.

రంభ—నీవెక్కడికేగుచుంటివి

వాసం—యింద్రాదిబృందారక వందిత పదారవిందుండును ని
ర్మలానంతహృదయుండును నిర్వికారుండును నిరామయుం
ను నిరంజనుండును భగవంతుడునునగు పరమేశ్వరునకు
నందనవనమునుండి పూజాపుష్పములదెమ్మని నందీశ్వరునిచే
నియోగించబడి అచటికిబోవుచుంటిని.

రంభ--అచ్చటినవీన వృత్తాంతములేమి

వాసం--జనకునియనుమతిని ననుదినంబును నెచ్చెలులంగలసివచ్చి పార్వతి ప్రమదాధిపుని సేవించుచున్నది.

రంభ--అందుకుఫలమేమి.

వాసం--మహాదేవుప్రసాదమే

రంభ--బాగున్నదికాని నీవునందీశ్వరునియాజ్ఞ నెరవేర్పఁ బొమ్ము నేనును నాతలంపు నెరవేర్చుకొనఁ బోయెదను.

(అనియిరువురు నిష్క్రమించుచున్నారు)

ఇదివిష్కంభము

(అంతట విజనసభామంటపమున మహేంద్రుడు ప్రవేశించుచున్నాడు)

మహేం--(మంటపద్వారముజూచి) ఓరీ ఎవడురాయక్కడ

దేవనంది--(ప్రవేశించి) దేవా ఇదుగోవచ్చినాడను

మహేం--నేడొకమహాకార్యమును గురించి యోచింపవలయును కావున ఆచార్యుండగు బృహస్పతులవారినిఁ దక్క దదితరుల రానీయక జాగరూకతతోఁగావలియుండుము

దేవనంది--చిత్తము (అనినిష్క్రమించుచున్నాడు)

బృహ--(ప్రవేశించిముందుకుజూచి) ఏమి ఈనిర్జరేంద్రుడు విజనసభామంటపమునందున్నవాడు

(కొంచమాలోచించి) ఓహో

ఉ॥ కాంచునుకొన్నికన్నులతోఁ గాంతిదొరంగ శిపప్రజచాపమున్
గాంచునుకొన్ని కన్నులతోఁ కంజదళాక్షులస్వర్గకాంతలన్
గాంచును భృత్యదండములఁగన్నులకొన్ని టనిట్టులుండిక
న్పించుసహస్రనేత్రుఁడుమదిన్ ఘనచింతనసేయనట్టిడున్
అందుచేత నీమహేంద్రునిఁ సమీపించెదను
(అనిసమీపించుచున్నాఁడు)

మహేం--(బృహస్పతినిఁజూచి పీఠమునుఁజూపుచు) దేవా ఈపీఠంబలంకరింపుఁడు

బృహ--మంచిది (అనిఅట్లుచేయుచున్నాఁడు)

దేవనంది- (ప్రవేశించి) శచీమనోహరా జోహారు

మహేం--ఏమిరా సమాచారములు

దేవ-- దేవదూతయగు దేవలుఁడు తసదొకమనవికలదని విన్నపంబొనరించుచున్నాఁడు

మహేం--అటులయినన తనినొక్కనిరానిమ్ము

దేవ--చిత్తము (అనినిష్క్రమించుచున్నాడు)

దేవలుడు--(ప్రవేశించి) ఈప్రభువు ఆచార్యుండగు బృహస్పతితోఁ నెద్దియోవిచారించుచు విజనసభామంటపమునందున్నవాఁడు అయినను సమీపమునకుఁబోయెదను (అనిసమీపించి) దేవరకు జయమగుగాక

మహే--దేవలా విచారించుచున్నవానివలె గన్పించుచున్నావేమి

దేవ--తారకాసుర బందిగ్రహణ భయముగాక మాకు వేరువి

చారమేమున్నది.

మహే—ఇప్పుడు క్రొత్తయపరాధమేమున్నది

దేవ—హద్దుమీరిన అసురపీడ దేవరతో నెట్లుమనవి చేయుదును అయినను

ఉ॥ ఇప్పని జేసె దారకుడు ఇప్పని సేయగ లేదటంచు నే
నిప్పుడు నీకు జెప్పుటయదేటికి దేవర నీ వెరుంగవే
చెప్పుటకొప్పు కార్యముల జేయుట లేదెదు రేరు నేమిచే
చెప్పగరాని కార్యముల జేయుట మానుట లేదధీశ్వరా॥

మహేం—అవును వాడంతటి దుష్టశీలుండెయగును మరేమిచే యుదుము అసమయమయ్యెను ఏమనిన

ఆ. వె. నముచిబలునివృత్రనామావశిష్టుల
గానొనర్చిగిరులగరులనరకి
జగము లెల్ల బోవజాలునాకిపుడడ్డు
వచ్చెదారకునెడ బ్రహ్మవరము.

అందుచేతనే యాకలుషాత్ముని యాక్రమణమునకులోబడ వలసి వచ్చినది లేకున్న వానిగర్వంబడంచుట కొక్కనిముసముబట్టునా అదియునుంగాక

తే.గీ. కాలగతిదప్ప హైన్యంబుఘనులకైన
ననుభవింపక దప్పదునల్పు జేత
జగములనుమూటి వెలిగించుచండకరుడు

చిన్న మేఘము చేతఁ గప్పఁబడుచున్న చంద్రునివలె నున్నావు

కావున చింతించక నిప్పుడాకలుషాత్ముఁడొనర్చిన యపరాధ

మేమొ చెప్పుము.

దేవ—అవధరింతురుగాక

చ. ఖలుఁడయి వాఁడు దేవనదిఁగల్గుసువర్ణ మయాంబుజాతయౌ

నలినములన్ని ద్రుంచె దునిమె నందనభూమిజనిఁబెంచునట్టిసం

తుల మొదలంటగా దునిమెదొంగిలెమా సురధేనువక్కటా

(అనిసగము జెప్పి యూరకొని కన్నీరు విడుచుచున్నాఁడు)

మహేం—అవశిష్టముగూడ జెప్పుము

దేవ—(కన్నీరుదుడుచుకొనుచు)

సురరమణీకచగ్రహముఁజూపదలంతురు నిమ్మహాఖలుల్

(అనిమరలకన్నీరు విడుచుచున్నాఁడు)

మహేం—దేవలా దుఃఖింపకుము

తే.గీ. మదముగదురగనీరీతినడరిపడెడు

చెనటిదారకుడికమీద జెడకబోఁడు

పొడవెసంగుతరంగములడఁగకున్న

పోటుగనిసముద్రంబుపాటుగనదె.

దేవ—(కన్నీరుదుడుచుకొనుచు) భవిష్యత్తునకేమి లెండి మ

హోన్నతసౌఖ్యసంధానులగు నిర్జరులిప్పుడిట్టిహీనములనుభ

వించుచున్నారుగదా

మహేం.—దేవలానీ కాసందియుం జేల

తే.గీ. హీనతోన్నతములవి రెండున్న తులకె
గాక నల్పులకెబ్బంగిఁగలుగవచ్చు
నమలులైనట్టి భాస్కరహిమకరులకె
గాక గ్రహణంబు మరితారకలకుఁగలదె.

కావున చింతించక నీవుసముచితకార్యముల జేయుటకుఁబొమ్ము కొన్ని దినములలో దానికి బ్రతిక్రియ కాగలదు.

దేవ.—చిత్తము (అనినిష్క్రమించుచున్నాడు)

మహేం.—ఆచార్యా

ఉ. ఇప్పని సేయవచ్చు నిపుడిప్పని సేయగ రాదటంచు దా
నెప్పుడునించుకంతయును నెంచక ధర్మము బాపఖర్చుఁడై
యెప్పుడు దేవసంపదల నేచుచునుండెడి తారకాసురుం
డెప్పుడు చచ్చునద్దియు వు జెవినుపింపగ దేగురూత్తమా.

బృహ.— దేవా గడచిన దినముందే మేమునిర్జరులతో గూడి సృష్టికర్తయగు పద్మసంభవునొద్దకేగి యడుగ తారకుడు షణ్ముఖుని చేతగాక తదితరులచే జావడని యవ్విరించి యానతిచ్చెను.

మహేం.—అతనిజన్మమునకు పాయమెద్ది

బృహ.—అవధరింపుము

తే.గీ. అచలకులనాథు చరియులయందు దపము
సల్పుచున్నాడు నిశ్చింతశర్వుఁడిపుడు

యెద్విధంబుననైననీ యీశ్వరునకు
గౌరిపైగోర్కె. లెస్సగగలుగుగాత.

పిమ్మట వారిరువురికి నుదయించు కుమారుండే సేనానియై మీ మనోరథమీడేర్చగలడని యానతిచ్చెను.

మహేం—అప్పరమేశ్వరుండు పార్వతినేలాగున బరిగ్రహించును పిమ్మటవారికుదయించు కుమారుండెన్నడు మనమనోరథమీడేర్చును.

బృహ—మహాత్ములవచనములూరక బోవు

మహేం—(జ్ఞప్తికి తెచ్చుకొని సంతోషముతో) పద్మసంభవుం డాజ్ఞాపించిన కార్యము నెరవేరునట్లుగా బొడసూపుచున్నది ఎట్లనిన జనకుని యనుమతిననుదినంబును నెచ్చెలులంగలసి వచ్చి శైలకన్యక నిత్యానంద నిజస్వరూపుండును నిరంజనుండును దుష్టనిగ్రహశిష్టపరిపాలకుండును భగవంతుండును నగు శంకరుని శేవించుచున్నదని రంభవలనవింటిని.

బృహ—అటులయిన మనకార్యము సిద్ధించినదే

మహేం—యింతమాత్రము చేత నేనా

సీ. అతిమనోజ్ఞంబులై యాహ్లాదకరములౌ యత్యంతమధురవాక్యములచేత
బరిపరివిధముల భ్రాంతికల్పన జేయు చారుకటాక్షవీక్షణలచేత
బాగుగదొలగిన పయ్యెదసవరింపగా గల్గుకంకణక్వణము చేత
నియమముపల రాజు జెరుకుసింగణులట్లు రమ్యంబులగు భవాలతల చేత
తూరితూరికి నప్సరోత్తుట్టియంబు। నలుపుతాదృశవిభ్రమసమితి చేత
స్ఫారమిసుమంతమనమునం బడయనట్టి। తపశిరత్నంబుసుమిచంద్రధరుడనంగ

నిఖిలభువనైకరక్షకుండును నిర్మలానంద చిత్తుడును సర్వ

జగన్మండల సృష్టిస్థితిలయకారుండును నగు నాఖండపరశుని వశీకరణమునకు గౌరీపరిచరణమే పాటివి

బృహ.—మహేంద్రా అందరిసుందరులవలె నా మెనుమాత్ర ముదలంపఁబోకుము ఎందుచేతనన

తే.గీ. చంద్రబింబసమానయాస్యంబుగల్గి
మనసుహరియించునొక వింతమహిమగల్గి
దనరుచున్నదిసుమ్మియాదంతిపుత్రి
అలరువలరాజునస్త్రొహ నాస్త్రమనగ.

మహేం—(సంతోషముతో) శబాస్ వలరాజని చెప్పుటచేత నాతడే యీయుమామహేశ్వరులగూర్ప గలడని నాకుతోచుచున్నయది

బృహ—(సంతోషముతో)

తే.గీ. సకలజగముల శాసింపజాలునట్టి
మీమనీషంబుమిక్కిలి మెరయుచుండు
కరము శాంతికపౌష్టికకర్మములనె
యేమరకనిల్చుమాబుద్ధి యెల్లనెడల.

ఏమనిన మాబుద్ధియు నీయాలోచనవైపరుగదయ్యె కావున శీఘ్రమె కాముని బిలువనంపుము.

మహేం.—(ద్వారమువంకజూచి) ఎవఁడు రాయక్కడ

దేవనంది—(ప్ర) దేవా యిదే వచ్చితి

మహేం— సేవకా కాముని సత్వరమె బిలువుము

దేవ—చిత్తము (అనినిష్క్రమించుచున్నాడు)

(అంతట కాముడురతివసంతులతో ప్రవేశించుచున్నాడు)

కాము—మిత్రుడా వసంతుడా ఏమి ఈనిర్జరేంద్రుండకాలమున బిలువనంపినాడు

వసం—నేనిట్టులదలంచుచున్నాను ఎట్లనిన

ఉ. ఎన్నగరానినేరమున నెవ్వతెయో చెలి నెమ్మనమ్మున
త్యున్నతకోపమూనితననూరకెసెందనమాచరింపగా
క్రన్ననగోసమూనిచుదికాంతనుతాబ్రతిమాలనోడిసీ
ప్రన్నసమోహనాస్త్రమునభామమదిఁకరగింపజూచెడుఁ.

కాము—అట్లైన అందరమును సమీపమునకు బోవుదము రమ్ము (అని కాముడు రతివసంతులతో సమీపించుచున్నాడు)

మహేం—(కామునిజూచి సంతోషముతో) అడుగో సతీమిత్రసమేతుడై

తే.గీ. ఎడలువగులంగఝుంఝుమ్మనిరొదలజేయు
భృంగములబారునారియైబరిఢవిల్ల
విల్లుభుజమున దాల్చిదామెల్లమెల్ల
పచ్చవిల్తుడుదానిటువచ్చుచుండె.

కాము—(రతివసంతులతో మహేంద్రునిసమీపించి) దేవా వందనము

మహే—మదనా నీకుస్వాగతము (అనిపీఠమునుజూపుచు) మి

త్రుడా యింనువసింపుము

కాము—చిత్తము (అనిరతివసంతులతో కూర్చునుచున్నాడు)

బృహ—ఓయీ కాముడా మాన్యచరితుండవగునిన్ను మహేం
ద్రుడు మన్నించుట మిక్కిలిపొసగియున్నది

కాము—(లేచిదోసిలియొగ్గి) నిర్జరేంద్రా

చం. ప్రభువయిముజ్జగంబులకు బాహుబలాఢ్యుడవైనయట్టియో
శుభకరనీకు నావలనసొంపగు కార్యమదెద్దినైజన
త్ప్రభలదిగంతరాళములమండగ జేయగజాలునా ప్రభా
ప్రభువుకచిన్నదివ్వెతనభాసలుచాలకకోరబోవునే.

బృహ—కాముడా అట్లనబోకుము ఏమనిన అసామాన్యమగు
ధనుర్విద్యదాల్చి జగద్ధితమై వెలుగుచున్న నీబాహువుక్క-
టియే ఈనిర్జరకార్యము నెరవేర్పదగియున్నది.

మహేం—మిత్రుడా కాముడా

తే.గీ. గిరులగరులనుదునుమాడి మెరయువాడు
పతికిదుర్వారమెద్దియాపనియెనీదు
పువ్వుటమ్మునగానుండిపొల్చుచుండె
నవురనీవెంతదోర్బలుడగుదొ కాని.

కాము—(గర్వముతో) ఎవ్వడునీకుశత్రుత్వమొనరించుచున్నా
డో వాడు

తే.గీ. మానికులోత్తముండైననుదనుజుడైన
మనుజుడైననుముగ్ధేందుమౌళియైన

వినుసురాంగనలకటాక్షవీక్షణముల
నిమునమునగట్టైవె చెనసీరజాక్ష.

మహేం—(బృహస్పతినిజూచుచున్నాడు)

బృహ—(మహేంద్రునిజూచికాముసితో) ఓయికాముడా యిప్పుడు ముగ్ధేందుమౌళియని నీచేత నెవ్వఁడు చెరమార్గముగ బరిగణింపబడియె ఆముగ్ధేందుమౌళియిప్పుడు నిరతిశయశీలాంతఃకరణుండై మంచుకొండను తపం బొనరించుచున్నవాడు.

కాము—తరువాత తరువాత

బృహ—సౌభాగ్యమయమగు సాలభంజికయనుబోలె విగ్రహముదాల్చిన సౌందర్యదేవతయో యనజంగమవల్లికా మతల్లికామంచుమలపట్టి యనుదినంబును జనకుని యనుమతినినెచ్చెలులం గలసివచ్చి యిందుశేఖరుని శేవించుచున్నది

కాము—తరువాత తరువాత

బృహ—అప్పార్వతీపరమేశ్వరుల కలయికయందు దేవతలకు మహాకార్యసిద్ధికలదు అదియును నీసహాయముననే కాదలచియున్నది.

కాము—(తనలో) ఎప్పుడును తనశక్తిఁదానెరుగమి నరులకాత్మనాశనము దెచ్చునుగదా ఎందుచేతనన ఆత్మశ్లాఘాపరాయణతభగసంతుని సామాన్యునిగాబరిగణించితిని

వసం—(తనలో) అనుకున్నదొకటి జరిగినదొకటి

తే.గీ. మోహనాస్త్రము చేదోయిబూనియెపుడు
యింతులను నేచజూచెడికంతుఁడెచట
జగములనుమాటిశాసింపజాలునట్టి
మహిమచేయొప్పుయాఖండపరశు వెచట.

రతి—(తనలో) అయ్యో ఫాలాక్షుఁడు జయింపదగిన వాడనుట చే మాకునిశ్చయముగా గడుకీడుమూడిన దే.

కాము—(తలపంకించితనలో) అయినను సకలజనులలో గడున ల్పుండనగు నావలనఁగూడ మహోన్నతులగు నిర్జరులు కార్యము నపేక్షించుచున్నారు గావున నేనాత్మనాశనమున కయిన నొడంబడి యీకార్యము నెరవేర్చ బ్రయత్నించెద ను (అనితలవంచుకొని యాలోచించుచున్నాడు)

మహేం—(చూచి) మిత్రుడా కాముడా

తే.గీ. ఈవు మోహనపస్త్రంబు నెక్కుబెట్టి
నిలతు వేనియుధైర్యంబు నేలగలిపి
మురువుదళుకొత్తుగిరిజ నెమ్మొగమువంక
నరయకుండుటనాచంద్రధరునితరమే.
కావుననీస్వల్పకార్యమున కాలోచింపకుము.

కాము— దేవర సెలవొసంగినట్లుచేశెదను.

వసం—మిత్రుడా కాముడా ముక్కంటినిబోబరుచు కొనగలవా

కాము—(గర్వముతో)

తే.గీ. ఏను మోహనాస్త్రంబు నెక్కుబెట్టి
నిలుతు నేనియు ధైర్యంబు నేలగలిపి
చంద్రబింబంబు బోలు యాసఖియ యాస్య
మరయకుండుట నారాజధరుని తరమె.

వసం — ఈమాటలకేమివచ్చెను లెమ్ము

ఉ. మాటలకేమి పేదరికమా నెరవేర్చుట దుర్లభంబు నీ
యాటలు సాగనిచ్చుటకు యబ్జదళాక్షులుగారు సూవెసూ
పోటరియైన మృత్యువును పొంక మడంచిన నీశ్వరుండు నీ
మాటలు మానుమింక హనుమంతుని ముందర కుప్పిగంతులా.

కాము — ధీమంతా వసంతా యీనిర్జరకార్యము దుర్ఘటంబైనను సాధ్యమైనంతవరకు నెరవేర్ప ప్రయత్నింపక మానను అది యునుంగాక.

తే.గీ. పాయువాడను ప్రియమును ప్రాణమైన
నీవిబుధకార్యమును జేయనిప్పుడేను
జగతినుపకారపరులు యాశంబుదిశల
నలరమృతజీవులగుచుందు రమలచరితా.

వసం — అట్లైననరే నీయిష్టము వచ్చినట్లు చేయుము.

కాము — మహేంద్రునితో దేవా నాకింకేమి యాజ్ఞ

మహే — దేవకార్యము నెరవేర్చుటయే

కాము — తాము శెలవిసంగినట్లు చేసెదను

మహేం—బృహ—చేయెత్తి

మ. కలుగుంగావుతనీకుమంగళమమోఘశ్రేయముల్దార్చుచి
వ్వ్యలకోర్కెల్దగనిన్ను బ్రోవశరముల్ బుంఖానుపుంఖోదయం
బులుగానీభుజశక్తిమించుతయశంబుల్ వెల్గలోకాళికిన్
ఫలమందించుపరోపకారివగునీభవ్యంబమోఘంబగున్.

కాము—(రతివసంతులతోనిష్క్రమించుచున్నాడు)

మహేం—బృహస్పతితో ఆచార్యా అబ్జసంభవునాజ్ఞానుసార
ముగా కార్యము మనచేతనేచేయబడినది కార్యసిద్ధినిగురించి
యదృష్టముకలశివచ్చునని తోచుచున్నది.

బృహ—అవునదియట్లే

మహే—అట్లుస్థాణ్వాశ్రమమును గురించి జనుచున్న కాముని
యనంతరవృత్తాంతము తెలిసికొనివచ్చుటకై నారదముని
నంపబ్రయత్నించెదను.

బృహ—మంచిది నేనును ప్రస్తుత కార్యసిద్ధికొరకుకులదేవతలనా
రాధింపనరిగెదను.

(అనినిష్క్రమించుచున్నాడు)

(అందరునిష్క్రమించుచున్నారు)

ఇదిద్వితీయాంకము.

—oo✿oo—



శ్రీరస్తు.

# మహీధరాత్మజా పరిణయము

## తృతీయాంకము.

---

(అంతట మహేంద్ర బృహస్పతులు ప్రవేశించుచున్నారు)

మహేం — గురువరా మదనుండెద్విధ శరసాధనమునన్నైన మృత్యుంజయుని వశపరుచుకొనునా లేక భీముండగు నాభీము నిందేరికైనం జూడంజాలక పారివచ్చునా అటుగాకున్న మహాకోపాంధకార చేతస్కుండగు కాలకంధరుని ఫాలనయనానలజ్వాలలకు మిడుతయగునా యెట్లుజరుగనున్నదో గాన రాకున్నది (యెడమకన్నదురుటసూచించిశంకతో)

తే.గీ. అక్కటా యెడమకన్నిప్పుడదరుచుండె
సురవితతికార్యమెటులైన జెరుచుకొరకు
సిద్ధముగనున్న యీవిధిచేష్టలెల్ల
విదితముగ నాకు నెరిగించునదియు వ్రాలె.

బృహ — అమంగళము ప్రతిహతముగాక మహేంద్రా ఇప్పుడీ శకునమునుంబట్టి యోచింప తద్వృత్తాంతమాసాంతముగ దె

లిసికొని నారదమౌనివచ్చునని తోంచుచున్నది.

(అంతటనారదుఁడు ప్రవేశించుచున్నాడు)

నార—(తనలో) నిర్జరేంద్రుని యాజ్ఞానుసారముగా స్థాణ్వాశ్రమమునుగురించి బోయెడి కాముని యనంతరవృత్తాంతమును దెలిసికొనుటకై అచటికేగి జరిగిన వృత్తాంతమంతయు దెలిసికొనివచ్చితినిగదా అందుచేతనీతనిసమీపించెదను (అనినడచుచున్నాడు)

మహే—(నారదునిచూచిబృహస్పతితో) అడుగో వీణావిశారదుండగు నారదఋషీశ్వరుండే యిటువచ్చుచున్నాడు వారికిఁబీఠము వేయబడుగాక.

బృహ—(పీఠము వేయుచున్నాడు) నారదుఁడుఁవసించుచున్నాడు

మహే—(లేచిదోసిలియొగ్గి) మహాత్మా దేవరకోరిక స్వాగతమో యస్వాగతమో శెలవీయగోరుచుంటిని.

నార—మొదటినుండి యంతయుజెప్పుచుంటి నవధరింపుము.

మహేం—అవహితుఁడనై యున్నాను.

నార—అట్లమరకార్యసిద్ధినిగురించి స్థాణ్వాశ్రమమున కరుగుచున్న యలరువిల్తుని యనంతరవృత్తాంతమును దెలసికొనుతలంపున మీయాజ్ఞానుసారముగా దిరస్కరిణీవిద్యచే వెంటనంటితిని

మహే—తరువాత తరువాత

నార—రతివసంతులతో కంతుడు స్థాణ్వాశ్రమము జేరి వసంతు

నిట్లనియెను

మహే.—ఎట్లని

నార—మిత్రుడా సీవీహిమవన్నగ ప్రాంత కాంతారములందు విజృంభింపుమని

మహేం— అతడేమనియెను

నార—అటుల నేయని తన ప్రభావ మాహిమాచల వనంబుల విజృంభింప జేసెను

మహేం—తరువాత తరువాత

నార—అందుచే

ఉ కేతకిబూచెన ల్దెసలఁ గెంజిగురెత్తెను పొన్న బృందమొం
తో తమకంబునన్బికవధూతతిగూయగసాగె భృంగముల్
ప్రీతిమరందపానమునుఁ బెంపు కలిర్పగ జేసినయ్యెడన్
ప్రోతలు సేయసాగెముద మొప్పహిమాచలభూములంతటన్

మహేం—తరువాత తరువాత

నార— తే.గీ. ప్రేమమీరఁగ కోయిలల్భామలొనగు
తేనెమామిడితలిరుల తేనెగ్రోలి
మనసుహరియించుపంచమధ్వనుల చేత
పచ్చవిలుకానిగరువంబు హెచ్చజేసె.

మహేం—తరువాత తరువాత

నార—

మ. అలరెన్ దాల్చి చివుళ్ళమామిడిసఖియాశ్లేషముల్వేడియున్
నలినాక్షీపదతాడనంబెడలిచయ్యన్ బూచెగం కేళితి
త్కాలగానమ్ముదొరంగిమోరటలు మొగ్గల్ దాలిచెన్ కేసరాల్
లలనల్ కాముము హెచ్చకల్లుమియకుండల్ బల్లవించె న్వేసన్.

మహేం — తరువాత తరువాత

నార —

మ. చిగురుల్దాల్చెద్రుమంబులన్నియును బూచెల్ మల్లికా
వ్రాతముల్
శగలైతో చెనుమాలతీతతికి రాజీవాకరోద్యానము
ల్తిగులన్ తోపణ మొప్పంబుప్పరసమున్ పెంపొప్పెని ర్మోఘ
గగనంబెల్లనునొప్పియుండెసురలోకాధీశ దేవేశ్వరా. మై

మహేం — తరువాత తరువాత

నార — వేయేల

ఉ. ఏమితుణతుణంబువచియుంచెద నావనమందునాడుని
ష్కామనులైనవానులునుకంజదళాతులయందు లెన్నగా
కాముకులయ్యె భామినులు కామినులై యెవరున్న వారితో
ప్రేమనుగూడసాగెజగమెల్లమునింగెను మోహవారధిన్.

మహేం — ఈప్రకారమమ్మాధవుని మహిమసర్వజగంబుల నొప్పి
యుండ ప్రద్యుమ్నుండేమిచేసెను

నార — ఆప్రద్యుమ్నుడున్ను రతివసంతులు తన వెంటరానున్న
తద్దేవదారుఖండమంటపమునందు తమశ్శుచర్మముపరచిన చ

లువ రాలయరుగుప్పై కూరుచుండి నిర్మలచిత్తుండై తపమా
చరించుచున్న గంభీరస్వరూపుండగు యాఖండపరశుని గ
నుంగొనియెను

మహేం—తరువాత తరువాత

నార—విస్మయాగ్గికంటియు జ్ఞాననేత్రముచే జ్ఞానస్వరూపుడ
గుతన్ను తాసాక్షాత్కరించుకొని పద్మాసనంబువదలి తపంబు
చాలించెను

మహేం—తరువాత తరువాత.

నార—కందర్పుడును యిందుమాళిసందర్శనమున కరతలము
నుండి విల్లుజారిపడుటయు అటువిస్మట జరుపదగినపని జరు
పజాలక కిమ్మిర్మరపుబొమ్మవలె నొక్కక్షణమూరకుండెను.

మహేం—తరువాత తరువాత

నార—

మ. హరునర్చించుటకై కృతాభరణయై యద్రీశజాగౌరిబం
గరుపుష్పమ్ములపళ్ళెరమ్ముగొనిబంగారంపురంగారుదు
వ్వలువస్దాల్చిమహేశుడున్నకడకున్వచ్చెన్గడున్భక్తితో
వరశృంగారసఖీయొయారమువుడేబత్యేకుమైనట్లుగన్.

మహేం—తరువాత తరువాత

నార—తరువాత నాపుష్పబాణుడు పట్టుదొరకినవానివలె వి
ట్టూర్పునిగిడ్చి లేచి దృష్టికెదురుగాకుండ యదనుకొరకె
దురుచూచుచుపొంచికూరుచుండెను.

మహేం—తరువాత తరువాత

నార—అంతట నామంచుములపట్టియుఁ దనయష్టాంగములు నేలతాకునట్టుల నాయష్టమూర్తికి సాష్టాంగ దండప్రణామంబొనరించెను

మహేం—తరువాత తరువాత

నార—ఆకాలకంధరుడా గౌరి ననురూపవరుని చేపట్టుమని దీవించెను.

మహేం—తరువాత తరువాత

నార—పిమ్మట నాకుసుమశరు డిదియే సమయమని సమ్మోహనాస్త్రముఁ బింటనొడిగెను.

మహేం—తరువాత తరువాత

నార—అంతట నాచంద్రశేఖరుడు కుసుమశరశరభాధితుడై తన నర్చించుట కెట్టయెదుట నిలుచున్న గిరిజానన మొక్కింతకాలముజూచెను.

మహేం—తరువాత తరువాత

నార—అట్టియెడ నప్పార్వతియు శరీరము పులకాంకురితమై యేమియుదోచక నాతని చెంగట నిలిచెను

మహేం—తరువాత తరువాత

నార—అంత నాభూతేశుడున్న మనోవికారము తపోబలము చే నిరోధించి తత్కారణమరయఁగోరి నలుదెసల బరికించి

మ. కనియెన్ రుద్రుడు చంచరీకగుణమాకర్ణాంతమున్లాగి మో
హనపత్త్రంబును వింటనున్ దొడగి ప్రత్యాలీఢపాదంబునన్
ఘనపూర్వాంగము వంచిముందుకు భుజాగర్వంబు దీపింపగా
దనమేనున్గురి శేశియేయుటకుఁ బొంతన్నిల్చు పుష్పాస్త్రినిఁ.

మహేం--(భయముతో) అవశిష్టము గూడ శెలవిండు.

నార--అంత నా రుద్రుని ఫాలలోచనమునుండి జగన్మండలంబంతయు నొక్క త్రుటిలో భస్మీపటలము శేయజాలిన ప్రళయకాలానలము వలె జ్వాలావళియనెడు జటలుగల యగ్ని విజృంభించి బయలు వెడలెను.

మహేం--(గద్గదస్వరముతో) యింకమీాద నేమి చెప్పెదురో కదా

నార--అంతట హరుని నేత్రాగ్నికి మారుడు బుగ్గోడాశము య్యెను

మహేం--హా భువనరమణీయ (అనిమూర్ఛిల్లుచున్నాడు)

నార--దేవా ఊరడిల్లుమూరడిల్లుము (అని ఊరడించుచున్నాడు)

మహేం--(మూర్ఛదేరి) దుఃఖముతో హా త్రిలోకసుందరా హా రుక్మిణీవరకుమారా హా విరహిణీరమణీమణీవిహారా హా పంచశరా పురందరునినిమిత్తము ప్రాణములను గోలుపోయితివా నీవు నిర్జరకార్యము నెరవేర్చి మమ్మానందింపజేతువని కొండంత యాసతో నుంటిమిగాని యిట్లు కాలమరణము నొందుదువని కలనైన దలంచనైతిని అయ్యో మదనా యికనే నేమి శేయుదును. (అని కన్నీరు విడచుచున్నాడు)

బృహ--దేవా విచారింపకుము కావలచినది కాకమానదు.

మహేం--(కన్నీరుదుడుచుకొని) సతియగురతి యేమిచేసినది

నార--ఆమెయు మూర్ఛాక్రాంతురాలైనది

మహేం--మిత్రుండగువసంతుడేమిచేసెను

నార--అతడును మూర్ఛపడియెను

మహేం--అట్లుమోహావశులగు వారిరువురు పిమ్మటనేమిచేసిరి.

నార--సతియగురతియునుఁ దనకన్న మున్నూరడిల్లినమాధవుఁడు తన్నూరడింప నెట్టెట్లో చైతన్యమునొంది కరంబులు శిరంబున మోదుకొనుచు నశ్రుసలిలధారాపరిషిక్తవదనయై యెట్టయెదుట బరుషపవనవికీర్యమాణ పాంసుపటలమై భసితమయమై పూర్వాకారముతోనున్న మగనిమేను బిగ్గగకౌగలించుకొని

తే.గీ. హామనోనాధహానాధవిమలచరిత
విబుధతతికార్యమును నెర వేర్ప బూని
హరునిఫాలాగ్ని యందునహుతుడవై తె
యక్కటాయెంతనిర్దయుండౌనుభవుడు.

మరియు

సీ. కర్కశపాషాణకంటకావృతభూతలంబిదిపుష్పతలంబెనీకు
కంటకవృక్షసంకలితఘోరవనంబు నవనవోద్యానవనంబెనీకు
వ్యాఘ్రాదిక్రూరసత్వావాసమైనపర్వతము లెధర్మహర్మ్యము లెనీకు
భేరుండఘనఘూకభీకరారావముల్ రమణీయతూర్యనాదము లెనీకు
అఖిలభాగ్యంబులనుబాసిసుఖమురోసి। సతినిచిరకాలమిత్రువసంతుబాసి
హరునిఫాలాగ్ని యందునహుతుడవైతె।అక్కటాయెంతనిర్దయుండౌనుభవుడు

అనివిలపించెను

మహేం -తరువాత తరువాత

నార--పిమ్మట హానాథా హానాథా యనివిలపించుచున్న రతి నాకాశవాణియిట్లనియోదార్చెను

తే.గీ. పువ్వుబోఁడిరో దుఃఖింపబోకుమింక
నెవఁడువిధియాజ్ఞదాటునీయవనిలోన
మరలజనియించునీమనోహరుఁడుధరణి
శంకరుఁడుగౌరి పెండ్లాడుసమయమందు
నచటికీవేగినుతియించు హరునినబల

మహేం--(సంతోషముతో)

తే గీ. మొట్టమొదటనునాకోర్కె మోసమయ్యె
తుదకుఫలియింపసిద్ధించెతోరముగను
మొదటకార్చిచ్చుచేకాలిపిదపకారు
మబ్బుతడుపంగచిగురెత్తుద్రమానుకరణి.

బృహ--దేవా ఆకాశవాణి సత్యమయినదియే యెద్విధముచేత నైన కాముఁడు పునర్జన్మమునొందగలఁడు

మహేం--అనంతర మేమిజరిగినది

నార--సమానదుఃఖితుడైన మాధవుఁడు రతి నతికష్టముమీద నూరడించి మెల్లమెల్లగతనయిల్లుచేర్చెను

మహేం--అట్లుకందర్పుని కథావశేషునిగానొనర్చిన కాలకంధరుండేమయ్యెను

నార--స్త్రీసమీపమునుత్యజించు విచ్ఛిన్నో నా ప్రమథాధిపుం
డు ప్రమధగణ సమేతుండై కైలాసమున కేగెను

మహేం--పార్వతియేమిచేసినది

నార--ఆమెయుమూర్ఛితురాలైనది

మహేం--పిమ్మట నేమిజరిగినది

నార--తే గీ. అంతహిమవానుడరుదెంచి యటులమూర్ఛ
గాంచికాష్ఠపివడియున్న కన్నకూతు
గారినోదార్చినిలబెట్టికరముపట్టి
మెల్లమెల్లగనడపించియిల్లుశేర్చె.

మహేం--(లేచిదోసిలియొగ్గి) మహాత్మా వినతగినది విన్నాను
యికమీాద మీరెందరిగెదరు.

నార--దేవాయీావృత్తాంతమును మరలపద్మసంభవునకు విన్న
వింపఁబోయెదను (అనినిష్క్రమించుచున్నాడు)

(అంతటరంభప్రవేశించుచున్నది)

రంభ--(తనలో) కుబేరనందనుండగు నలకూబరుని సదనము
నుండి వచ్చుచునేనోషధి ప్రస్థపురంబునందు విన్నవృత్తాంత
ముస్వామియగు మహేంద్రునకువిన్న వించెదను (అనిసమీాప
మునకుబోయి) స్వామికి జయమగుఁగాక.

మహేం--రంభాయెందుండివచ్చుచున్నావు

రంభ--నలకూబరునిభవనమునుండి

మహేం--అచ్చటివృత్తాంతము లేమి

రంభ--కాలకంఠుని ఫాలానలజ్వాలలచే కందర్పుడు కథావశేషుడయ్యెనని అందరును జెప్పుకొనుచున్నారు యిదియునుంగాక ఆయోషధిప్రస్థపురమున యింకొక విశేషముకూడ కలదు.

మహేం--ఆయింకొక విశేషమేమి

రంభ--మదనదహనముచేత హతమనోరథయగు గిరిజ హరునే వరునిగా నిచ్ఛగించి కఠినతపంబుచే తనకోర్కెనెరవేర్చుకొనజూచుచున్నదని

మహేం--ఆవిషయమునతలిదండ్రు లేమనిరి

రంభ--తల్లియగు మేనకాదేవియిట్లని చెప్పినది ఎట్లనిన

తే గీ. నిద్రహారంబు లెడబాసినీవుకఠిన
తపము శేయంగజాలవుతనయజాల
కష్టమయినట్టిపవితల పెట్టితీవు
దుఃఖ మంటంబనియిదినా కుదోచుచుండె.

మహేం—తండ్రి యేమనియెను

రంభ——అందులకతఁడనుమతించెను

మహేం.—రంభామంచివార్త చెప్పితివే నీపనిమీదనీవుబొమ్ము

రంభ——చిత్తము (అనినిష్క్రమించుచున్నది)

(తెరలోవైతాళికులు)

తే.గీ.కమలములువిన్నవోవగ కాలతిమిర
మవనిభాగంబుగప్పుటకై రహింప

సంజ కెంజాయపశ్చిమాశను వెలుంగ
భానుడపరాంబునిధి జేర బారెనకట (మరల తెరలో)

తే.గీ. కడిమిమందేభ దైత్యులగసిమసంగి
రక్తసిక్తాంగుడైసుఖాస క్తుడగుచు
తురగములుదప్పి తోనీడ్వ జరి గెనపర
వార్ధిని నుండి బడలిక వాయుకొఱకు.

మహేం—(విని) అటులైన మేమును సంధ్యావందన మాచరింప
బోవుదుము.

(అందరునిష్క్రమించుచున్నారు)

ఇదితృతీయాంకము.





శ్రీరస్తు.

# మహీధరాత్మజా పరిణయము

## చతుర్థాంకము.

---

(అంతట ముని వేషము ధరించి నంది ప్రవేశించుచున్నాడు)

నంది — నందీ మదనదహనముచేత హతమనోరథయగు పార్వతి నాయందే మనసునిల్పి కృతనిశ్చయురాలై విశేష నియతిం గౌరీశిఖరమను పేరుగల తండ్రిశిఖరమునం దపమాచరించుచున్నది తపము ప్రారంభించి చిరకాలమైనది అందుచేత నీవు ముని వేషముధరించుకొని యచటికేగి యామె ప్రియసఖులగు జయావిజయలవలన యామెనియమ మెట్టిదో యభిలాష బంధ మెట్టిదో దెలిసికొనిరమ్మని పరమేశ్వరునిచే నాజ్ఞాపింపబడితిని గదా అందుచేత స్వామికార్యమును నిర్వర్తించెదను (అనిముందుకునడచి విమర్శించి) ఆహా స్త్రీలమనస్సులు ప్రకృతికఠినములుగదా సందేహమేమి.

సీ. పదియారుకళలచేభాసిల్లుపూర్ణిమాసోము మోమును బోలు మోముగల్గి
దిరిశనపూబోలి మెరయు మెత్తని మేను కమలసమాన నేత్రములుగల్గి
భ్రమరపక్షంబులపరిభవింపగజాలి కొమరారుచున్నట్టి కురులుగల్గి
దనరుచున్నట్టియీ చెలివనములందు। స్థిరమనంబున మౌనులు శేయునట్టి
కఠినతపమును శేయకై గడగి నేడు। సందియంబంతలేక దాసాహసించె.

మఱియు

తే.గీ. అతులపేశలపర్యంకమందుమున్ను
పండుకొనునీ పెపవళించువట్టినేల
చారుదుస్వాల్పుగట్టెడీచపలనేత్ర
కఠినవల్కలనివ్వడుగట్టుచుండె.

ఇంకను

తే.గీ. చారుచందనజలములజల్లనైన
లలితసౌధాంతరంబులమెలగునీమె
నెరవుచున్న బిదపమువినిర్గలముగ
గడుశెగలెగయుపంచాగ్నినడుమయందు

(అనికొంచెముముందుకునడుచుచున్నాడు)

(అంతట జయావిజయలు కుసుమాపచయము శేయుచు ప్రవే
శించుచున్నారు)

జయ—(పూలుకోయుటమాని) విజయా తపోనియమమందు
కృతనిశ్చయురాలగు పార్వతిమనోరథమెప్పుడుఫలించునో

విజయ—కామునికథావశేషునిగా నొనర్చిన కాలకంధరుని
హృదయమెప్పుడు కరుగునోఅప్పుడు

(అనియిద్దరుపుష్పములుకోయుచున్నారు)

నంది—(ముందుకుచూచి) ఆమెనెచ్చెలులగు జయావిజయలు
వీరలేమైయుండవచ్చును అయిననుసమీపించి తెలసికొని
యెదను (అనినడచుచున్నాడు)

జయ — విజయా నాపూలగరిడియనిండినది నీదెంతవరకునిండినదే

విజయ — (పూలసెజ్జజూచి) నాపూలసెజ్జయునగము పైనిండినది కొదువకూడానిండింపగలను (అనిపుష్పకరండమును పూలతో నింపుచున్నది)

నంది — (సమీపించి) నారీమణులకు జయమగుగాక

యిద్దరు — మహాత్మా వందనము (అనినమస్కరించుచున్నారు)

నంది — కాంతామణులారా మీకుస్వాగతము కళ్యాణులారా మీరెవ్వరు యెందునిమిత్తమీపుష్పములగోయుచున్నారు.

యిద్దరు — మహాత్మా సకలాచలకులచక్రవర్తియగు హిమవానునికుమారియైన పార్వతిప్రియసఖులము జయావిజయలను వారము ఆమెతపోనియమమందుంటచే దేవపూజానిమిత్తమీ పుష్పములుగోయుచున్నారము.

నంది — ఆమెకుతపమెందుకు

జయ — అనురూపవరునిపొందుటకొరకు

నంది — ఆయనురూపవరుడెవ్వడు

జయ — తే గీ ఆదిమధ్యాంతరహితుడటంచు వేద
వాక్కు లెవ్వని దెల్పునో నిక్కముగను
ఈశ్వరాహ్వయమును దానుఎల్లయెడల
యెవడువహియించియుండె నాయిందుధరుని.

మాప్రియసఖి పతిగానభిలషించి మహేంద్రప్రముఖులగు దిక్పాలురననమానించి తపముచేయుచున్నది.

నంది—దుర్లభవస్తుప్రార్థనానిబంధనముగలదియు సందిగ్ధఫలము గలదియునగు నీతపమెందులకు దేవతలలో నెవనినో నొక యనురూపవరునిగ్రహింపవచ్చును ఖండపరశుడన్ననో కోర్కెలుజయించినవారిలోనగ్రేసరుడు అందుచేత ప్రియసఖులగు మీరామెకు హితోపదేశము శేయుడు.

జయ—మహాత్మా మాప్రియసఖి పరమేశ్వరునే పతిగాబడయుదును అటుగాకున్న కఠినతపశ్చరణశేయుచు యీశిఖరమునందే విలీనురాలనగుదునని తపోనియమ ప్రారంభమందు కృతనిశ్చయురాలయినది.

నంది--(తనలో) వినవలసినదివిన్నాను యింకనీవృత్తాంతము నీలలోహితునకు విన్నవింపబోయెదను (ప్రకాశముగా) వారీమణులారా నేబోవుచుంటిని

(అనినిష్క్రమించుచున్నాడు)

యిద్దరు—మేముప్రియసఖికి పూజాపుష్పము దీసికొనిపోవుచున్నాము (అనియిరువురునిష్క్రమించుచున్నారు)

(ఇది మిశ్రవిష్కంభము)

(అంతటనైష్ఠికునివేషముతో శంకరుడుప్రవేశించుచున్నాడు)

శంక—(తనశరీరముచూచుకొనితనలో) యీవేషముపార్వతిని వంచించుటకు తగినదే అవును అదియట్లే

చం. వలమగుకజ్జహస్తమునవన్నె దొరంగుమెకంపుతోలునిం
పలరగమూపునన్ శిరమునందున పెంజడలున్ విభూతిరే

ఖలు మొగమందునుం జెయిని కాంతివిశాలపునకుమాలద
ర్భలదగఁగూర్చయుంగరము భాసిలుచుం డెడుకర్ణమందునన్॥

(ఆలోచించి తలపంకించి)

మ. ననవిల్తుండటుమోహనాస్త్రమునుపింటన్ గూర్పసాపత్రపా
ననమై చెక్కులుపుందహాసరుచులన్బాసిల్లగాజూపుల
జ్జనుసిట్టట్టదురన్ గఁగుర్వొడువగా సర్వాంగమేక్రొత్తరూ
పునుగొన్నట్టులనిల్చెనయ్యది యెసిర్పన్ దోచునా నెమ్మదిన్.

అందుచేత కఠినతపశ్చరణచే విశేషతప్తురాలగు నీమెను నే
నిప్పుడే ననుగ్రహించెదను నామెప్రియసఖులవలన యీమె
భావబంధము తెలసికొని నందినాకు చెప్పుటచే నీమె కెగ్గొన
రించు వానివలెమారు వేషముతో నటించెదను

(అనివినయముతో నడచి విమర్శించుచున్నాడు)

(అంతట జయా విజయలు సేవించుచుండ తపస్సు జేయు
చున్న పార్వతిప్రవేశించుచున్నది)

పార్వతి—(సంతోషముతో) సఖులారా జయావిజయలారా

తే. గీ. అనిలవశమునపత్రిమల్లాడుభంగి
అదరుచున్నయదెడమకన్నధికముగను
మందభాగ్యురాలనగు నేబొందనున్న
దేమిశుభమొకో తెలియదుయిందువలన.

జయ—శుభవతీ పార్వతీ స్త్రీలకెడమకన్నదరుటయు పురుషు
లకు కుడికన్నదరుటయు శుభసూచకములని పౌరాణికులు

జెప్పుచుందురు అంత చేతనట్లు నిష్కారుణత్వంబున మదన దహనమొనరించిన యాయిందుమౌళి యే మునిముఖమున నోవచ్చినిన్ననుగ్రహింపగలడని యీశకునమువల్ల దెలియ వచ్చుచున్నది.

పార్వ—ప్రియసఖివచనముసత్యమగుగాక

విజయ—చెలియగుజయ నిజము చెప్పినది

శంక—(పార్వతినిజూచి) ఆహా

క. ఇచ్చెలికోమలదేహం
 బెచ్చటదారుణమగుతప మెచ్చట సెగలన్
 ద్రచ్చెడుగ్రీష్మంబెచ్చట
 యొచ్చటసుదతీలలామ మెటనూహింపన్.

అహా యికోమలాంగి నన్ను ద్దేశించి యెంతగడపః క్లేశ మనుభవించుచున్నది.

జయ—(శంకరునిజూచి) సఖి పార్వతీ యమూర్తిభవించిన బ్రహ్మచర్యమువలె నొకలేప్రాయంపు పురుషుండిటు మొగమై వచ్చుచున్నాడు

పార్వ—అతిథులైవచ్చిన మహర్షులకు మీారు పూజసేయదగును నేనెప్పటివలె నియమ మాచరించెదను (అనితపమాచరించుచున్నది)

శంక—(పార్వతినిజూచితనలో)

తే.గీ సకియమద్వ్రత వేకినిజాలడస్సి
 చెన్నువహియించునిదెనారచిరగట్టి

లేతసంధ్యపు కెంజాయలీయమగుచు
అలరుచున్నదిపద్మారిక శను వ్రాలి.

(అని సమీపమునకుబోయి ప్రకాశముగా) సఖీమణులకు జయమగుగాక

జయవిజయలు—మహాత్మా యింనువశింపుడు (అనిపీఠము వే యుచున్నారు)

శంక—(కూర్చుని మార్గాయాసము నభినయించుచున్నాడు)

జయ, విజయులు—(బ్రహ్మచారికి వీవనలు విసరుచున్నారు)

పార్వతి—(చెలికత్తెలనుజూచుచున్నది)

శంక—(చేయెత్తి) సఖులారా అనన్యసామాన్యమగు మీసౌజన్యముచేతనే మాయాయాసము సంపూర్ణముగా నపన యించబడినది

జయ, విజయలు—(విస్మయముతో) మహాపురుషు లెందుండి వచ్చుచున్నారు

శంక—యిపుడు కైలాసమునుండివచ్చుచున్నాను

జయ—అటులైన అర్ఘ్యమును గ్రహింతురుగాక (అనిఅర్ఘ్య మునిచ్చుచున్నది)

శంక—(అర్ఘ్యమునుగ్రహించి) కళ్యాణులారా మిమ్మొకమాట డుగనభిలషించుచున్నాను

జయ—మహాపురుషులడుగుదురుగాక

శంక—(పార్వతినిౙ్రవేలితోజూపుచు) ఈమెవ్వరు మీరెవ్వరు

జయ—మహాత్మా ఆమెసకలాచలకులచక్రవర్తియగు హిమవానుని కూతురు పార్వతియనుపేరుగలది మేమామెకు ప్రియసఖులము జయా విజయలనువారము

శంక—(ఆశ్చర్యముతో)ఆయేమీయామె సకలాచలకులచక్రవర్తియగుహిమవానుని కుమారియా

తే గీ అట్టిమహారాజుకడుపునబుట్టియిటుల
ఆకులలములభక్షించియడవులందు
స్థిరమనంబునవానులు సేయ నట్టి
కఠినతపమును సేయుటేకతమునసఖియ.

జయ—అనురూపవరునిపొందుటకు చేయుచున్నది

శంక—అనురూపవరునకై తపముగూడ సేయవలసివచ్చినదా అయిననీముజ్జగంబులలో నీమెకొరతగినవాడెవ్వడు

జయ—ఉన్నాడొకమహాపూరుషుడు

శంక—తనరూపురేఖావిలాసములు జూచుకొని యంతగర్వించిన యాకఠినచిత్తుడెవడు.

జయ—మహాత్మా వినుండు

తే గీ ఆతెమధ్యాంతరహితుడటంచుధరణి
నెవని బ్రాహ్మణ్యులన్నియు నెరుక సేయు
నీశ్వరాభిఖ్యయునునుదా నెల్లకడల
నెవడువహియించియుండెనాయిందుధరుని.

పతిగానభిలషించినదై మాప్రియసఖితపము నెరపుచున్నది

శంక—(పార్వతితో) కళ్యాణీ యిదినిజమేనా

పార్వ—(మౌనమువిడచి) మహాత్మా సఖులచేత నెట్లుచెప్పబడిన దో అట్లేనామనోరథమును.

శంక—(తనలో) యిప్పుడునన్ను నేనిందించుకొని యీమెమ నస్థైర్యమును బరీక్షించెదను (అనిప్రకాశముగాచప్పట్లుకొట్టి

చ. బసకుస్మశానమాతనికిపాముచిభూషణమెప్డుభిక్షువై
మసలుటవృత్తివృద్ధవృషభంబుహయంబుదిశాళివస్త్రము
ల్వసుమతిలోన యిట్లైనడమంగళచిహ్నలదాల్చునంచున
ర్వసుజనులెంతురాపురుషుపైభ్రమజెందితివేమిచెప్పదున్.

మరియు

తే.గీ సర్వపర్వతకులమేలు చక్రవర్తి
యగుహిమాచలకులరత్నమీవుయెచట
యెల్లపుడుదాల్చుపులితోలువల్లకాటి
యందువసియించుభవుడేడనబలసెపుమ.

అదియునుంగాక

ఉ. ఎన్నడుపన్నగంబనగనేమొయెరుంగవునీవువానినిన్
పన్నగపెంకిలాడినసుబట్టవలెన్ జెయివానిచేతినిన్
పన్నగమొక్కటున్నదదిపాపపుజంతువుయేమిసేయునో
ఎన్నగబాలవీవపుడుయెట్లుచరింతువుజెప్పుమియ్యెడన్.

పార్వ—(చెవులుమూసికొని తనలో)అక్కటా యీమునిప్రవ రుడు కర్ణకఠోరవాక్యములచే యీపరమేశ్వరుని నిందించి

నామనస్సునెంతయు నొవ్వజేయుచున్నాడు (అనిప్రకాశముగా శంకరునితో) అవియన్నియు మీకేల మీతలంపున మీరుగుజరింపరాదా.

శంక——సుందరీ నీవీవిధమున మనసునందునుదృఢపరచుకొనిన పక్షమున

తే గీ. ఇంకసరసిజనేత్రయీయిందుధరుని
వరునిగానీవుబడయంగవచ్చుజుమ్మి
శత్రుతైలెనట్టిరాహువుపక్త్రిమున
జొరబడాచంద్రరేఖనుజూచురీతి.

పార్వ—(ముఖవైవర్ణ్యమునిరూపించి)

తే.గీ. ఆదిపూరుషుఁడంచునిత్యయుపయుంచు
నెవనిప్రామిన్కులన్నియు నెరుకసేయు
నామహాత్ముని నిందనమాచరించు
నీదునాలుకప్రక్కలైపోదదేమి.

(అనిసఖులతో)

సఖులారా మహాపురుషనిందఁజేయువారికన్న వినినవారికెక్కుడుదోసంబుగల్గును ఇతడుబ్రాహ్మడు చేయునదినిరంకుశమగుమహాపురుషనింద కావునమనమిచ్చోటుబాసి వేరొకతావునకుఁ బోదమురండు (అనిసఖులతో మరియొకచోటికిఁ బోవనభినయించుచున్నది)

శంక——(నిజరూపమునుదాల్చి)

తే.గీ. సఖియనీదగు సౌఖ్యంబు సరసముగన
భాగ్యపురుషుఁడు దానెటుబడయనేర్చు
నీకు జేదోడు నెరపెడి నేర్పుగల్గు
దాసజనునై తినూ వెనీతపము మెచ్చి.

(అని పార్వతి చేయిపట్టుకొనుచున్నాఁడు)

జయ——పుణ్యవశమున పరమేశ్వరుఁడు సన్నిహితుడయ్యె నిది మాకత్యానంద మత్యానందము.

విజయ——(దోసిలియొగ్గి) మహాత్మా సకలాచలకుల చక్రవర్తియు నీమెతండ్రియునగు హిమవానుని గృహంబున జరుగు వివాహకార్యము నకరుదెంచి యీమెనుగ్రహింపవలయునని మేము వేడుకొనుచున్నారము మాముద్దుసెల్లింపవలయును

శంక——(వినుగుతో తనలో) ఇంక నేనెట్లు మొసలగలను (ప్రకాశముగా) మంచిదిలోకాచారమును దాటకూడదుగదా.

విజయ——అయిదుదినములలో వివాహమెట్లగునో అట్లుజాగ్రత పెట్టుము

శంక——అయిదుదినములలో అనుము అదియుక్తమే

తే.గీ ఉవిద నెడబాసియుంటలోనొక్కక్షణమె
యుగుచునున్న దికల్పసహస్రకోటి
కొన్ని నాళ్ళలో జరుగంగనున్న దీని
నెట్లుసహియింపనోపునాహృదయమకట.

విజయ——వివాహమంగళవస్తుసంపాదనమునకు బోవనభిలషిం

చుచున్నారము.

శంకర—మంచిది అటులనే చేయుడు మేమును పరిణయకార్య మునకు వసిష్ఠాదిసప్తరుషుల నంపఁబ్రయత్నించెదము.

(అనినిష్క్రమించుచున్నాడు)

(అందరును నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# మహీధరాత్మజా పరిణయము

## పంచమాంకము.

### ఓషధీప్రస్థపురము.

(అంతట శిలాధరుడు ప్రవేశించుచున్నాడు)

శిలా — (తనలో) శిలాధరా భగవంతుండగు కాలకంధరుని చే నంపబడి అరుంధతీ సమేతులై వసిష్ఠాదిసత్పురుషులు నిన్న టిదినంబె వచ్చిలబ్ధవరయైన వత్సకీదినము వివాహమంగళ యోగ్యమని నిర్ణయించిరి అందుచేతనీవు పురమలంకరింపజే యుమని స్వామియగు హిమవానునిచే నాజ్ఞాపింపబడితినిగ దా అందుచేతస్వామి నియోగము నెరవేర్చుదను (అనిముం దుకునడచి చేయెత్తి) ఓపౌరులారా.

చం. అరుణరసాలపల్లవములందమెలర్పగ ద్వారశాఖల
న్విరివిగగట్టరే గగనవీధినిమించెడు కేతనంబులె
త్తరెగడుజల్లిపుష్పములఁదెచ్చరెగంధముఁవీధులన్గిరీ
శ్వరునితనూజకిత్తరివివాహమహోత్సవమయ్యెడు౯ దగ౯.

(అని ఆకసమువంకజూచి); ఆ ఏమనుచున్నారు మీరు చెప్ప కపూర్వమే నగరమంతయు మాచేతద్విగుణముగా రచియిం పబడినదనియా (అనిపురమంతటన్గలయజూచి) అదిగోపుర

మంతయు పౌరులచేత మాయాజ్ఞకుబూర్వమే నినుమడిగ రచియింపబడినదని అందుచేత నీపురాలంకారమును స్వామి కి విన్నవింపబోయెదను (అనినిష్క్రమించుచున్నాడు)

(అంతట హిమవంతుడు వివాహమంటపమున ప్రవేశించు చున్నాడు)

హిమ — ఉ. ఆగసినాడ నారదునియప్పటిసూచన నేడుశూలినా
కూరిమియల్లుడౌటమునెకోరితి నెమ్మనమందుప్రేమనే
కోరినయట్లెనాకిపుడు ఘోరతపంబొనరింపగౌరిచే
కూరెమనంత రాయములుకూడగతించెనదృష్టవంతుడన్.

(అంతటశిలాధరుడు ప్రవేశించుచున్నాడు)

శిలా — (దగ్గరకువచ్చి) స్వామికిజయమగుగాక

హిమ — శిలాధరాపురమలంకరింపజేసితివా

శిలా — ఈయుత్సవము స్వకీయమని ప్రత్యేకముగా పౌరులెం చుకొనుచుండ పురాలంకారమెట్లుతక్కువగును మనయాజ్ఞ కుపూర్వమే పౌరులచేత నినుమడిగా జేయబడినది.

హిమ — శిలాధరా పార్వతీపరిణయమును జూచుటకై సర్వప ర్వతకులం బేతెంచినదా.

శిలా — దేవా కైలాసగిరితక్క సకలాచల కులంబునువచ్చినది

హిమ — కైలాసగిరి రాకయుండుటకుకతంబెయ్యది

శిలా — అతడు పెండ్లికొమరునివైపున కావున వారితోవచ్చు చున్నాడు.

హిమ—వధూగణముతో గూడ విశ్వావసు ప్రభృతులగుగంధర్వులును అమరులతోగూడ నచ్చరలును విచ్చేసిరా

శిలా—అందరువచ్చియున్నారు.

హిమ—అట్లయిన నీవంతిపురమునకేగి వచ్చినయచ్చరులచేత వత్సయగు పార్వతికి దగ్గరనుండి నలంకరింపజేయుమనియు ఆయలంకారప్రకారము మరలరుదెంచి నాకుంజెప్పుమని కులవృద్ధయగు కౌశికతో జెప్పుము మఱియు గౌరీకల్యాణముదర్శించవచ్చిన వారందరికిని పెండ్లికొమారునితోవచ్చినవారికిని మనవైపునవచ్చినవారికిని సత్కారమొనరించుటకు సకలలోకవస్తు సంభారములను సిద్ధముచేయించవలయునని మంత్రియగు జయశీలునితో జెప్పుము

శిలా--చిత్తము (అనినిష్క్రమించుచున్నాడు)

(అంతటనారదుడు ప్రవేశించుచున్నాడు)

నార--చం. వెనుకొకసారినేను దలపెట్టిననిర్జరకార్యమిప్పుడే
ఘనతరయంతరాయములగాసియొనర్చివిచిత్రవైఖరి
న్దనరెఫలింపసిద్ధము; తద్దయుభూధరరాట్కుమారితా
నొనరగనెండవానలకునోర్చిచి జేయతపంబునెంతయున్.

(అనికొంచెము ముందుకునడచి) అదుగో హిమవంతుడు వివాహమంటపమున గూర్చున్నాడు అతనిసమీపించెదను (అనిహిమవంతుని సమీపించుచున్నాడు)

హిమ--(నారదునిచూచిలేచి) నారదమునీంద్రా అభివాదనమొనరించుచున్నవాడ.

నార--గిరీంద్రాసీకు స్వాగతము మహేశ్వరుని యల్లునిగాబడసి తివా

హిమ--మహాత్మా యిదితమరు నాటినబీజమునకు ఫలమే (అనిపీఠ మునుజూపి) యిందువసింపుడు.

నార--మంచిది (అనిఅట్లుచేయుచున్నాడు)

(అంతట కౌశికిప్రవేశించి కూర్చొనుచున్నది)

హిమ--అమ్మా వత్సయలంకరింపబడినదా

కౌశి--వినుము

చం. పరిమళయుక్తమైతనరు భాసురతైలముదెచ్చిప్రేమన
చ్చరలునసంబరాళులఁ యుసన్నుతిగాంచినయట్టివస్త్రమిం
పలరగగట్టుకొన్నలినాక్షిశరీరమునందుజాలరా
చిరిదగనిండువేడుకవిచిత్రముగాగమహీధ్రరేశ్వరా.

హిమ--తరువాత తరువాత

కౌశి-- తే.గీ. రతనగద్దియమీాదనురమణినునిచి
మిన్నువాకజలములచేమించుబోండ్లు
మంగళస్నాతజేసిరిమాన్యచరిత
దుములమైశుభశంఖనాదముచెలఁగా.

హిమ--తరువాత తరువాత

కౌశి--ఉ. చారునిమజ్జనంబున నెస్వచ్ఛతబొందినయాశుభాంగిక
ర్పూరపరాగపాండురత బొల్చెడుదువ్వలువల్ ధరించిమై

నీరద రాజిచేగడువిసి స్థలమైదనరారునింగియా
శారదశర్వరీరమణచంద్రికలన్ ధరియించుకైవడిన్.

హిమ--తరువాత తరువాత

కౌశి-- తే.గీ రమణిపదపంకజంబులలక్కయనెడు
లేతనీరెండపూతదలిర్చుచుండె
నీలమణినూపురంబుల నెపముచేత
గ్రమ్ముకొనెనందురుఝుమ్మని భ్రమరపంక్తి.

హిమ--తరువాత తరువాత

కౌశి-- తే.గీ. అమలరతనాలకటిసూత్రమంబుజాక్షి
ఘనతరనితంబసీమనుగట్టబడియె
వేల్పుటేటిలో సైకత వేదియందు
దీరిదనరారుసారసబారువోలె.

హిమ--తరువాత తరువాత

కౌశి-- తే.గీ. చందనముచేతనలరారుచెలికుచముల
సఖియలందరునక్షత్రసరముగట్టి
రంతసింధూరరజము చేనరుణమైన
మదకరేణువుకుంభంబునందువోలె.

హిమ--తరువాత తరువాత

కౌశి--అయ్యో

తే.గీ. మిగులసొంపగురతనాలనగలవాన
మగుచునలరారుచున్న యామగువపీను



పుష్పరత్నసంతతిచేతబొలుపుమీరు
శంఖనిధినించుకేనియుసరకుగొనదు.

హిమ--తరువాత తరువాత

కాశి-- తే.గీ. వనజదళనేత్రకర్ణపార్శ్వములయందు
మంచిముత్యాలకమ్మలమర్పబడియె
విపులముఖజలజంబుసేవింపవచ్చు
చంద్రమండలద్వితయంబుచందమునను.

హిమ--తరువాత తరువాత

కాశి--తోయజలజాక్షి సోగకందోయికపుడు
అంజనముదిద్దియొక్కింతనతివయాస్య
మందుపరిమళయుక్తమైయలరుచున్న
దివ్యకస్తూరితిలకంబుదిద్దిరనఘా.

హిమ--తరువాత తరువాత

కాశి-- తే.గీ. మడములనునంటుచున్నట్టిమగువకురులు
మృదులమందారకుసుమగర్భితమనోజ్ఞ
వేణికాబంధముగజుట్టి పెద్దప్రొద్దు
కన్నుమూయకగాంచిరికాంతలెల్ల

హిమ--తరువాత తరువాత

కాశి-- తే.గీ. భూషణములంగములకునుమురువుదెచ్చు
ననుటలోకప్రవాదమేయగునుగాని

అరసిచూడంగ పూబోడియంగకము లె
మేనితోడవులకోక యింత మెరుపుదెచ్చె.

హిమ--ఇట్లయినవత్స మీసాన్నిధ్యవిశేషంబుననె అంతలెస్స గానలంకరింపబడినది.

(తెరలో)

మ. విలురత్న మందరకంద భాహతివలద్విస్తారదుగ్ధాబ్ధిగ
ర్భలసద్వీచిపరంపరార్భటులకున్ వ్రతండికంబై రొద
న్గల శైలేంద్రగుహాల్ప్రతిధ్వనులసంక్షోభంబునొందంగని
శ్చలనాదంబయి మ్రోగునొక్క సురనిస్సాణంబుసాటోపమై.

(అందరుతొందరతో నాలకించుచున్నారు)

(మరల తెరలో)

మ. చనుమాపార్శ్వమునన్ సురేంద్రజలజాక్షాతోడ రాజెప్పుస్వ
స్తినిపద్మాసనరుద్రరుక్కులుబుషుల్దివ్యంబుగావల్కరే
చనుడీరుద్రగణంబుముందిశనునుత్సాహంబునన్వేగనో
యనిలావీవుముచారుమారుతముయాహ్లాదాంతరంగుండవై.

హిమ--మహాతీవల్లభా దేవతల కోలాహలమువలె వినబడుచున్న యిదియేమి

నార--గిరీంద్రా యింద్రాది బృందారక వందిత పదారవిందుండై శుభవివాహవేషముధరించి నీయల్లుండైన చంద్రశేఖరుండిటేవచ్చుచున్నాడు యీమహాధ్వని యాతనిముందున డచుచున్న నందీశ్వరుని ప్రోత్సాహరణధ్వని కావున నీవర్ఘ్యపాణివై యామహామహు నెదుర్కొనుము.

(అంతట వివాహవేషముధరించి శంకరుడును దేవసంఘము
ను ప్రవేశించుచున్నారు)

శంక--(విష్ణుతో) మాధవా ఈయోషధీప్రస్థపుర మమరావ
తికన్న మిన్నయై ప్రకాశించుచున్నది.

విష్ణు--మహేంద్రునికన్న గిరీంద్రుడు తక్కువవాడాయేమి

హిమ--(అర్ఘ్యపాణియై శంకరుని సమీపించుచున్నాడు)

శంక--(చూచి) వసుంధరా ధరేంద్రుండర్ఘ్యపాణియై నన్నెదు
ర్కొనుచున్నాడు కావునవాహనముదిగి పోయెదను (అని
అట్లుచేయుచున్నాడు)

హిమ--(తనలో)

తే. గీ. ఈశ్వరాహ్వాయమును దాను నెల్లయెడల
నెవడుధరియించియుండెనాయిందుధరుని
నల్లునిగబొందనిప్పుడీయవనిలోన
నెన్ని జేసితొమున్నెనుపున్నెములునూ.

(అనిసమీపించుచున్నాడు)

శంక-- (చూచితనలో)

తే. గీ. అతిభరంబైనచరణవిన్యాసమునను
క్షితినినిమ్నాన్నతనిబతెజేసివినయ
సరణిదనవారలకునేర్పుకరణినదిగో
నన్నెదుర్కొనుచున్నాడునగవిభుండు.

(అనిహిమవంతునకు ఎదురుగావచ్చుచున్నాడు)

హిమ--(శంకరునకు అర్ఘ్యమునిచ్చుచున్నాడు)

శంక--(స్వప్రమాణముగా నందుకొనుచున్నాడు)

హిమ--(సిగ్గుతోతలవంచుకొనుచున్నాడు)

(అల్లునిముందుంచుకొని హరి విరించి ప్రముఖులు నడచుచున్నారు)

బృహ--హిమవానుడా వివాహమంటపమెక్కడ)

హిమ--ఆచార్యా ఇక్కడిక్కడ (అనిపీఠమునుజూపును)

(అందరునుబోవుచున్నారు)

బృహ--గిరీంద్రా సుముహూర్తము సమీపించినది అందుచేత పెండ్లికూతునుదోడ్కొనిరమ్ము.

హిమ--(తెరవంకచూచి) అమ్మా ఇటు ఇటు

(అంతట జయావిజయలతో పార్వతిప్రవేశించును)

పార్వ--(తనలో) నేడేకదా నామనోరథకల్పవృక్షముఫలించును

జయ--(నవ్వుచు) చెలీపార్వతీ యింతవరకేమేను నీచెలికత్తెలమగుట.

పార్వ--(అసూయతో) ఓసీవిజయా ఇదియేమనుచున్నదే

విజ--సఖీపార్వతీ ఈపెసరసాలాప కుశలత్వము చూపుచున్నది (అనియిరువురును పార్వతితో శంకరునిసమీపించుచున్నారు)

బ్రహ్మ--(విష్ణుతో) మహాత్మా దేవతలందరు భూతగణముతో సముచితాసనంబులందు గూర్చుందురుగాక.

(అందరు అట్లు చేయుచున్నారు)

హిమ— నూతనముగా వచ్చిన సర్వపర్వతకులము కైలాసముతో నెడమప్రక్క గూరుచుచుండుడు (కులపర్వతములట్లు చేయుచున్నవి)

బృహ— శంకరా పెండ్లికూతునితో నీవీ వేదికమీద దూరువు మొగముగా గూరుచుండుము.

శంక— (అట్లు చేయుచున్నాడు)

బృహ— (అగ్ని నిప్రజ్వలింపజేసి) శంకరా నీచేతితో పార్వతి హస్తముబట్టుకొనుము.

శంక— (అట్లు చేయుచున్నాడు)

పార్వ— (పులకోద్భేదము నభినయించుచున్నది)

బృహ— వధూవరులగ్ని హోత్రునకు ప్రదక్షిణమొనర్తురు గాక.

(ఇద్దరు అట్లు చేయుచున్నారు)

బృహ— (పార్వతి చేతితో లాజహోమము చేయించుచున్నాడు)

పార్వ— (పొగగమ్ముటచే శ్రమనభినయించుచున్నది)

బృహ— శంకరా పార్వతిపాదపద్మమును చేతులతో సన్నికంటిమీదనుంచుము)

శంక— (చిరునగవు మొగముతో నూరకొనుచున్నాడు)

కులగిరులు— (సంభ్రమముతో) మహాత్మా ప్రమాణభూతుడగు పురోహితు డాజ్ఞాపించినట్లు చేయవలెను.

భూతగణము—(సంరంభముతో) కులగిరులారా త్రిలోకనియంతయగుభగవంతుడునీలలోహితుడెట్లాజ్ఞాపింప బడుచున్నాడు

బ్రహ్మ—(నవ్వుచు నుభయులను వారించి) సర్వజననియామకము స్వతఃప్రమాణభూతమునగు వేదమేయిట్లువిధించుచున్నది కావుననట్లుచేయుము.

శంక—(ముడుచుకొన్నహస్తములతో పార్వతిపాదపద్మమును సన్నికంటిపైమోపుచున్నాడు)

బ్రహ్మ—(మంత్రమును చెప్పుచు పార్వతివంకజూచి మోహితుడై మంత్రముజెప్పుటమాని తనలో)

ఆహాయేమి యీమెరూపురేఖావిలాసము

చం. తమలపుటాకుసౌరు వనితామణిమొత్తనిమేనుతీరునే
త్రములుమెరుంగుడాలు వెలిదమ్ములనేలగజాలుయింద్రనీ
లములుశిరోజముల్కరతలంబుగులాబిసుమంబుమేలుమే
లమణిమనోహరావయవరమ్యతనెన్నతరంబెయేరికిన్.

అనిప్రకాశముగా తప్పులతో మంత్రమునుజదువుచు మోహముచే పార్వతినిచూచుచున్నాడు

శంక—(తనలో) ఏమిభగవంతుడగు పద్మసంభవుడే మంత్రమునుతప్పులుగా చెప్పుచున్నాడు అని (బ్రహ్మనుసూచితలపంకించి) యిదియాకారణము చీ మత్తచిత్తా (అనిబ్రహ్మ పార్వతిని జూచుచున్న మధ్యశిరమును చేతితో ఖండించుచుచున్నాడు)

బ్రహ్మ—(మిగిలిన శిరములపై చేతులువైచుకొని) హా పరమేశ్వరా యీదీనుడొనరించు అపరాధమును క్షమింపదయ లేకపోయెనా అకటా నాకీకోరిక యేలకలుగవలె యిట్లీశిరంబేల కోల్పోవలెను. యిదంతయునేజేసుకొన్న పురాకృతఫలము అనుభవింపక నెట్లుపోవును (అనిదుఃఖించుచున్నాడు)

విష్ణు—(బ్రహ్మనుజూచి) ఓయీ అంబుజసంభవా ఊరడిల్లుము పురాకృత కర్మఫలమనుభవింప నేరికిని దప్పదు గావున చింతనొందక కానున్న పనికానిమ్ము

బ్రహ్మ—(ఊరడిల్లి విధివిశేషమును సమాప్తి నొందించుచున్నాడు)

బృహ—వధూవరులు పురోహితుడగు బ్రహ్మకు నమస్కరింతురుగాక

(వధూవరులట్లు చేయుచున్నారు)

బ్రహ్మ—(చేయెత్తి)

తే. గీ. అఖిలజగములతలిదండ్రులైనమీకు
నెగడుతననన్యసులభమహానిందుప్రేమ
భువనజాలార్తిహరమూర్తిబొడముగాత
తారకాంతకుడైనట్టితనయుడొకడు.

(అనిదీవించుచున్నాడు)

వృద్ధస్త్రీలు—(ప్రవేశించి)

తే. గీ. ఒండొరులకు దుల్యసురూపయుతులరగుచు
అతులబద్ధానురాగులైనట్టిమీకు
వెన్నెలకు చందమామకు వెలయురీతి
యిట్టిదనరాని యొకప్రేమబుట్టుగాత.

(అని ఆర్ద్రాక్షతలు చల్లుచున్నారు)

(అంతట రతి ప్రవేశించుచున్నది)

రతి—(లేచి దోసిలియొగ్గి) ఉత్సాహము.
ప్రాకటాహిభూష ఘోరపాపవార్ధిశోషల
క్ష్మీకళత్రమిత్ర వాతమిత్ర నేత్ర యాంధకా
ఖ్యాకదేవతాహితాంధకారమిత్ర సంతత
శ్రీకరానవీనచంద్రశేఖరాకృపాకరా॥

నాకవసపూజితాసినాకపాణిశర్వచా
మీకరాచలంబకాసచారుసోమశేఖరా
లోకపాలకాకపర్దిలోకిలోచనప్రభా
శ్రీకరానవీనచంద్రశేఖరాకృపాకరా॥

భీకరేభదైత్యనాశ భీమవామదేవమం
దాకినీభుజంగదేవతాతరుప్రభాంగని
ర్వ్యాకులాంతరంగ దుష్కృతాళిభంగ సంతత
శ్రీకరానవీనచంద్రశేఖరాకృపాకరా॥

శోకదంభవాతదండశోకశిక్షితాసురా
నీకపాకశాసనాదినిర్జరార్చితాంఘ్రినా

శ్రీకభక్తలోకపాలలేఖధారుణీరుహా
శ్రీకరానవీనచంద్రశేఖరాకృపాకరా॥

ఏకరూపమై ప్రపంచమెల్లనీవయయ్యుభ
క్తైకశీలతన్వశింతువీవునిర్మలాత్మకా
లోకనాథనీకృపావిలోకనంబుజూపుసు
శ్రీకరానవీనచంద్రశేఖరాకృపాకరా॥

శంక — ఓపతివ్రతాశిరోమణీ నీప్రార్థనమెంతయు నాయంతరంగమున సంతసము జేసెను కావున

కం. ఏమిటికై ప్రార్థించెద
వేమిటినీకామితంబు నెరిగింపుమునీ
కామోదమునసంగెద
నామాటనిజమ్ముగాగనమ్ముముమదినిన్.

రతి — దేవకార్యమునిమిత్తమపరాధ మొనర్చిన మన్మనోహరుని మరలసజీవునిగాను తమచరణారవింద సేవకునిగను నను గ్రహింపకోరుచున్నదానను

శంక — నీయభీష్టమెట్లోఅట్లేయగును

రతి — (సంతోషముతో) నేడుగదా నామనోహరుండు సజీవుండయినది అందుచేత నేనిప్పుడే పోయి నాకాంతుని గలసికొనియెదను (అనినిష్క్రమించుచున్నది)

హిమ—

శా. శ్రీకళ్యాణగుణాకరుండుతనుజన్నేపట్టెవిశ్వాత్ముడా
శ్రీకంఠుండుమదీయపూర్వసుకృతశ్రోత్సేకమ్మునన్బండెడు
న్నాకశ్రేణిమనోరథంబులుస్ఫురన్నవ్యాకృతిన్దాల్చుచు
న్లోకానందకరుండుమన్మథుడుసల్పున్వేండిగన్పండువున్.

శంక—ఇంకనునీకేమికావలయును

హిమ—అఖిలాభీష్టములు నెరవేరినవారికింకేమి గోరికయుండు
ను అయిననుయిట్లగుంగాక

(భరతవాక్యము)

చ. సురపతిశోర్కెల్లపుడుసొంపగుగాతబుధేంద్రులందరు
న్గరముయశస్కులైధరణిగ్రాలుతవర్షముకుంభవృష్టిగా
కురియగసస్యగర్భమయికుంభినియొప్పుతరాచకన్యల
న్వరులతోఁగూర్చికాలమునమానులుసాంద్రయశమ్మునొందు
శంక—తథాస్తు తథాస్తు [తన్

(అందరునునిష్క్రమించుచున్నారు)

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

---

# LATCHMI NARASIMHA SARASAMU.

BY

ASTAVADHANI

Puranam Ramachandra Sastri

*Asthana Pandit*

IN THE

SAMASTHANAM OF

M. R. Ry RAJAH VASIREDDI

Sree Chendra Mouleswara Prasaad Bahadur,

MANNAI SULTAN GARU ZAMINDAR

OF

Chintalapati Vonta Kistna District.

MADRAS

Printed at the Sreenikethanam Press

1908.

Price One Anna

శ్రీరస్తు.

శ్రీలక్ష్మీనృసింహస్వామినేనమః.

# లక్ష్మీనృసింహ సరసము.

ఇది

మహారాజ రాజశ్రీ రాజా వాసిరెడ్డి శ్రీచంద్ర మౌళీశ్వర
ప్రసాద్ బహదర్ మన్నెసుల్తాన్ చింతలపాటివంటు
జమీందార్ సర్ దేశ ముఖ్ మన్నెవార్ సర్కార్
ముర్తుజాన్నగర్ వగయిరా దొరవారి సంస్థాన
పండితుఁడయిన

అష్టావధాని

పురాణం-రామచంద్రశాస్త్రిచే

రచియింపఁబడి

చెన్నపురి:

శ్రీనికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.



1908

వెల 1 అణా.

# పీఠిక.

అయ్యా,

నేనీ గ్రంథమును శ్రీలక్ష్మీనృసింహస్వామివారియందుగల భక్తిచే రచియించి శ్రీస్వామివారికి సమర్పించితిని యిందు లక్ష్మియు నృసింహమూర్తియు సరసమాడుకొనినట్లు వ్రాయఁబడినందున లక్ష్మీనృసింహసర[illegible]సమని పేరిడితిని యిందుగల గుణదోషముల నెరింగి దెలుపుటకుఁ బండితులఁ బ్రార్థించుచున్నవాఁడ.

విధేయుఁడు,

 పురాణం - రామచంద్రశాస్త్రి.

శ్రీరస్తు.

శ్రీలక్ష్మీనృసింహస్వామినే నమః.

# లక్ష్మీనృసింహ సరసము.

శా॥ శ్రీలక్ష్మీయుదయించెఁ బ్రాగ్దిశని యా + శీతాంశుఁడై చందురుం
డాళీసంఘము నిద్రఁజెందఁగలపం + బామోదమున్ జేయునీ
వ్రాలే మేల్కొనియుంటినీవునటులే + ప్రొద్దయ్యెనింకేమియీ
కాలంబందునఁ జేయునానో తెలియం + గాఁజూచి వార్త్రుచ్చుమా.

మ॥ ఇది యీలాగనిమీకుఁ జెప్పఁగలనా + యే నెంత శ్రీనారసిం
హదయాసాగర నీసుపుత్త్రిడగునీ + యబ్జాశుగుండి త్త్రతిన్
నిదురం జెందఁడుముద్దులన్ దనుపువా + నింగూడి యోచించిసౌ
ఖ్యదతన్ జెంగట సేవసింపఁగనువాఁ + డాసించినట్లాడుమా.

శా॥ నాతీక్షీరసరిత్పతీంద్రతనయా + నాముద్దుబిడ్డండునా
చేతోజాతునితోఁ బసంగూడి కిరణ + శ్రేణింబుకింగొల్పియా
నీతోఁ బుట్టువు చందురుండుజగమున్ + జీకాకునొందించువాఁ
డీతీఱాతనితోఁ బసంబుట్టువగునీ + వేమింక నజ్జేసెనో. 3.

చం॥ జగములనెల్ల మోహమును + సంభ్రమములోఁ బడవైచియుంచున
వ్వగలుగు నీదు కామసుత + పూరము నిండఁజేసెడినీదుమాటనౌ
మిగులగరంచె నాతనువు + నీకిదె కాన్కగ దాననిచ్చితిన్
దగుమవిఁ కేమిచేసిన ని + తంబినికింతయె శక్తిమాధవా. 4.

చం॥ పలుకులనొక్క యర్థమును + భావమునందున నొక్క యర్థమున్
నిలిపి వచింపఁగాఁ దనరు + నేర్పును గల్గి చరించువారు కాం
తలు హరునంతవానినయి + నట్టి దమ చెయ్యుల మోసఁబుచ్చఁగాఁ
గలుగుదు రోటవారి తమ + కంబుల గుర్తెరుఁగంగ సాధ్యమే. 5.

చం॥ వనితల నమ్మరాదనుచుఁ + బల్కిరద్దియ థార్థమంచు నె
మ్మనమున విశ్వసింపఁదగు + మాటయె కాదననమ్మ వారె మో
హినియసురాధినాథులన + హీనపరాక్రములన్ గరంచి వం
చననొనరించు టీరెరుఁగ + సారసపత్ర విశాలలోచనా. 6.

ఉ॥ కౌటుక రేకఁ దిద్దికొన + గన్నుల వ్రతువ గుబ్బ దోయిపై
పైటనొయారముల్ గులుక + వైచి భుజింబడి జీఱు కొడఁగా
నీటుగఁ గుచ్చిళుల్ నిలిపి + నిల్చితి ముంగల మోహినీ మరిం
కేటికి కాలమున్ గడిపె + దిచ్చల పీర్చ్చదొ మోసగించెదో. 7.

మ॥ జగముల్ మూఁడిటియందునన్ జెలఁగి స్వాం + చచ్ఛక్తిచే మాయఁబు
చ్చి గుణోపేతులఁ జేసి మానుషులవం + చింపంగ నానిన్ను నే
వగవంచింపఁదలంతు వీడెము లిడన్ + వాంఛల్ మదిన్ గల్గెఁ బ్రే
మగతిన్ జేకొని యాదరింపుమిదుగో + మడ్బిందిరా వల్లభా 8.

తే-గీ॥ ఒక్క చే శంఖమమరు వే + ఱొక్క చేయిఁ
జక్రమంబుజ మపరహ + స్తంబునందు
గిరుల వహియించు నేర్పున + వరలునొకటి
గాన విడెమిమ్ము దనుపుము + గలదు ప్రేమ. 9.

చం॥ పదియును నాల్గులోకముల + వానియధీశుల సాగరాళితో
నుదరమునందు నింపిన బు + ధోత్తము లెన్నఁగఁ బ్రాఁత పల్కులన్

దుదిపిహరించునిక దనుపఁ + దొయ్యలినేనెటులోర్తురాలను
ద్విదిగొని వేలొసంగినటు + లెంతయుఁ బ్రీతివహింపుమాధవా 10.

కం|| తమలము నేడే మొ యొకవి
ధమగురుచిఁ దెచ్చి పెట్టఁ + దరుణీయే మే
మిమురిఁగలిపితివో దాని ని
జము నెఱిఁగింపుము మనంబు + సంశయమెడలన్. 11.

శా|| ఏమీ మందులమారినా యెఱిగినీ + విట్లేల సందేహమో
స్వామీ చెందితి దుష్టచిత్తయయి యే + వామాక్షి బోధించెనో
నీమీదన్ మనసెల్లనిల్పి సతమున్ + నేనుండ నేరొబలెన్
మోమాటంబొకయింతలేక యనెదే + మొందించవే మాధవా.

తే-గీ|| అబలయనరానిమాట నే + వంటినో కొ
యింతలో నింతకినుక వ + హింప నేల
గాకతాళంబు వేయఁగాఁ + గలరుసతులు
వసుధనొకచేతనొకటన + భంబుపట్టి. 13.

సీ|| ఒకరిబిడ్డల పురిం + కొకరికిఁబసినాఁడె
తెంపువహించి మా + ర్పింపలేదు
పుడమి కోఁడులనెల్ల + మోసఁబుచ్చఁగ నెంచి
మారురూపులనూని + మసలలేదు
నేల్పులఁగొలుచుట + వెఱ్ఱితనంబంచు
యుక్తులవెదఁజల్లి + యుడుపలేదు
కనికర మంతరం + గమునం దొకింతక
లేక నారుల విద + ళింపలేదు. 14.

తే॥ గీ॥ కొంచియుంటివొ యేమేమి + కఠినమయిన
పనుల నాయందు సామాన్య + భామినులను
గల్పినీకిటుఁజాల్కాన + గావచింపఁ
జెల్లెనమ్మక చెల్లల + క్ష్మీనృసింహ 15.

శా॥ ఇప్పాటన్ దగపంచుఁబల్కెదవునీ + కేచెల్లెనీవార్తలన్
జెప్పంబూనినఁ గల్పముల్ గడిచెడున్ + సింగారమోకీవిరో
మెప్పానిశ్చలమా మరేమికలదో + మీవారికిన్ నీకునున్
దప్పుల్ సేసితొలేదొ పన్నిపగుటన్ + సైరింపఁగాఁజెల్లెఁబో 16

సీ॥ తగవెలంతుకవు నీ + దగుచెల్వమెన్నఁగా
వలనొనెయునినాఁడు + పలుకవొక్కొ-
తరుణిరో నినువీడి + తాళలేననితమ
కించివక్షమున నె + క్కించుకొనవె
యొకకాలమున మద్వి + యోగమునందిచె
ట్టుల వేచవే నన్నుఁ + దెలియఁగోరి
కినియుక కూర్మిన + యినవిన్నునేలుడు
ననవె యానాఁడల్ల + పనికివేడి. 17.

తే॥ గీ॥ యట్టిగుణశాలివీవిప్డు + బెట్టిదమగు
పల్కునేట్లాడితో నాఁటి + వాఁడవీవు
కావొ క్షమలేదొ యింకొక + కాంత నందుఁ
జిత్తముండెనొ తెల్పుల + క్ష్మీనృసింహ. 18.

కం॥ పురుషుల మనమెరుగఁగదు
స్తరమా యువతీమనంబు + ధాతకునయినన్
దరమా తెలియఁ బదంబుల
ధరపై నటునీటనగునె + తరుణీ తెలియన్. 19.

తే॥ గీ॥ స్వచ్ఛమైనట్టికులమున + జన్మమంది
పాలవెల్లికిఁబట్టైనై + పట్టినీదు
కరముఁజెన్నొందుచున్ననీ + కెరుఁగరాదె
నవ్యసరసిజనేత్రశ్రీ + నారసింహ. 20.

సీ॥ పొంగు గలిగి యట్టి + బొబ్బలనిడు భయం
కరరూపుఁడై నిన్నుఁ + గన్నతండ్రి
యొద్దనుఁజేరుచుచు + నుండనీతల్లికి
నీచోపసరణంబు + నిత్యవృత్తి
గురునకు నామంబుఁ + గూర్చునీయన్నచేఁ
బధికసంతతి బాధ + వఱుపఁబడెడు
నాకరికిమదవృద్ధి + నొసఁగునిన్ జనులెల్లఁ
జంచలవని కడుఁ + జాటుచుంద్రు 21.

తే॥ గీ॥ మూఁడుజగములవారుమి + మ్ములనుమమ్ము
నెరిగియుండురు వర్ణింప + నేలపుగున
మిన్న విను మమ్మపుట్టిల్లు + మేనమామ
యొద్దఁబొగడెడు నట్టుల + నుర్విలోన. 22.

మ॥ వనజాక్షా విను నీకు మామశయనా + వాసంబుమాతండ్రిలో
చనమున్ మానసమై వెలుంగఁగనవే + చర్చింపమాయన్ననీ
తనయారత్నము బిడ్డనిచ్చినది యా + ధాతాంగి మాతల్లినే
వనితన్ దాసినిపీరునీకుఁబరులా + వర్జింప దూషింపఁగన్. 23.

ఆ॥ వె॥ మన్మనోపహారి + మదిలోనఁగినియకు
మమతదీర్పవేగ + మాటవరుస
వచ్చినట్టివానిఁ + బంతంబువహియించి
లలన గూర్చికొని త + లఁపున నిడకు. 24.

ఉ॥ జీవితనాథ నీవలుకc + జెందిననాయును రెట్లునిల్చునీ
సేవకురాలc జిత్తజాcడు + చిత్తముcగొందల మందcజేసెడున్
మోవినియానుదాన ముద + మున్ గనc గౌcగిలిcబట్టుదానఖు
భావమునందుదాన సెల + వా రతికై నిగమాచలాలయా 25.

శా॥ నేనైనన్ దమిcబట్టcజాలcగలనా + నీకంటె ముమ్మందుగా
నానన్ మోవినిcగన్నుదోయిcబునుకన్ + స్వాంతమ్మునన్ నిల్పిశ్రీ
ప్పానూనాస్తుcడుదొందరించురతికై + యత్యంతమోహయిందిరా
నానన్ జెందకునీవి రేక ముడినా + నందమ్మునన్ విచ్చెదన్ 26.

తే॥ గీ॥ సెజ్జయందముcగోరదు + చెలువ నిమురc
గిన్కcదలcపదు వచ్చునే + గికివెఱువదు
తలిని వేచదు తుదిగాన + దెఱుకగనదు
మోహమెంతటిదో కాని + పురుషసింహ. 27.

సీ॥ ముంగెరా నీకొక్క + మ్రొక్కు సల్పెద మోవి
నానుచోcదటుకున + సద్దుపడకు
మంజలిcజేసెద + హారమా చన్నులc
బట్టుచోననుcజిక్కు + వఱుపవలదు
కొంచినీగజ్జెల + కలరవమెన్నెద
విప్పుపొక్కిలివట్టె + గప్పcజనదు
కాశనీయందముc + గరచునుతించెదc
గూటమిని బెదరc + గొట్టcబోకు. 28.

తే॥ గీ॥ మనుచునీయాభరణముల + నభినుతించి
వేడుకొంటిని నిన్నిcక + వేడువాcడ
చివురువిల్కానికేళి నేc + జేయునట్టి
తప్పులను క్షమియింపcగాc + దలిరుబోcడి. 29

తే॥ గీ॥ మహిని యఘటనా ఘటనాస + మర్థశక్తి
గలిగి దనరిన వాని ని + న్నొలసి యడ్డ
గింప క్షమియింపగలరెని + లింపులయిన
యప్రమేయ చతుర్భుజ + యమలచరిత. 30.

శా॥ ఫుల్లాబ్జేక్షణ చూచితే యొకటనం + భోదాతశుభ్రాంగుఁడై
మెల్లన్ గప్పె గిరీంద్రయుగ్మమును సం + ప్రీతిన్ విలోకింపగా
నుల్లంబిత్తఱిఁ దత్తరంబువడు నీ + యుక్తిన్ దొలంగించియు
త్పుల్లాసంబునఁ జూపుమా గిరులనీ + కొప్పింతు నా సంపదన్.

చం॥ కులిశముఁ జేతఁ బట్టి గిరి + కోటి నడంచు బలారి పట్టిచే
తులఁ బలు గాయముల్ వఱపు + మున్ గనుఁడంచుఁ దలంచి వచ్చు ని
న్మలకువముం దెగన్గొని స + మీపమునన్ వసియించు మబ్బులో
మలగవదాగ బీతివిను + మా వెలిఁ బుచ్చఁగ నాయమా హరీ 32.

సీ॥ జననసమయమునఁ + జయ్యన వెడలితి
రమణిరో కంసకా + రాగృహంబు
కలఁచి దురాత్ముశి + క్షనొనర్చి వచ్చితి
లీలతో వెడలి కా + ళిందిమడుఁగు
నడవిలో నడుమఁ దృ + ణావర్తుఁ డెసఁగఁగఁ
బన్నినమాయలఁ + బడక యుంటి
చిమ్మచీకటులకు + నిమ్ముగునలజాంబ
వంతు నిగుహ వెలు + వడితి నాఁడు. 33.

తే॥ గీ॥ కానిసీ నాభికూపంబు + లోనమునుఁగు
నుల్లమునుఁ దీయఁగాఁ జాల + కున్నవాఁడ
యేమి కారాగృహంబోయి + దేమిమడుఁగొ
యేమి మాయయొ మరియుని + దేమిగుహయొ. 34.

ఆ॥ వె॥ నాన. నాభిబిలము + ననునీదుచిత్తము
సొరఁగదానితోఁడ + సొగసుకాఁడ
నిన్ను నామనమున + నిల్పితిఁదరియింపఁ
గోరికలు ఫలింపఁ + గూర్మిఁబెంప. 35

కం॥ చెలి నీమానసమున న
న్నిలిపినచోదవులనున్న + నీసిబ్బెఁపుఁగు
బ్బలపైవసింపఁజేయఁగ
వలదా చెలికాని సేగి + వారింపంగన్. 36

ఉ॥ గుబ్బలులన్ వసింప గజ + కుంభములన్ నఖరాజిఁ గ్రుచ్చిత
బ్బిబ్బొనరించిముత్తెములఁ + బెల్లుగనెల్లెడఁజల్లరాజవై
నిబ్బరపాటు లేక రమ + ణీయనృకేసరి యిట్టులాడఁగా
నబ్బురమయ్యెడుఁ బ్రియవ + యస్యత్రయీవిపులాధరాలయా

తే-గీ॥ కలికి మాటలఁ గాలంబు + గడుపఁబోకు
చాలఁబ్రొద్దయ్యెమరుబాళిఁ + దూలినాఁడ
ప్రాపుఁజేరితి బ్రతికింప + భరమునీది
నాతెలియొసంగిరతిఁదన్పి + వనరుహాక్షి. 38

కం॥ రమ్మామానవసింహా
యిమ్మాపరిరంభణంబు + నిదె నాతెఱగై
కొమ్మా నీవి వదలెను సు
నమ్మారఁగనుక మొసఁగుము + నన్యాజకేళిన్. 39

సీ॥ అమృతంపురుచికన్న + యలఁతియౌ కెమ్మోవి
యబల యింకొకసారి + యాననిమ్ము

వరుని సతతంబు దయనుబ్రో + వంగవలయుఁ
గీర్తిశుభముల నొసఁగిల + క్ష్మీనృసింహా. 49.

మ॥ ప్రమదారత్నము భక్తియుక్తుఁడసదృ + గ్భావుండు వేదాంతస
క్తమనస్కుం డలరాజు నీవెఱుఁగవో + కల్యాణముల్ గూర్తుస
త్ప్రమునీకోరిక రామచంద్రకవికా + వ్యాసక్తసంతోషధీ
రుమహిన్ బ్రోతును వాసిరెడ్డికులచం + ద్రున్ జంద్రమౌళీశ్వరున్
50.

ఇది

పురాణసంశోపయః పారావారరాకా

చంద్రోభయభాషాప్రవీణ

రామచంద్ర ప్రణీతంబయిన

లక్ష్మీనృసింహాసరసము

సమాప్తము.

---

## ప్ర క ట న.

---

### వనితావిలాసము రు 0-2-0.

ఇది యొక శృంగారగ్రంథము. పురుషుఁడొకస్త్రీనిగురించి విధముల విలపించును. యామినీపూర్ణతిలకను వీడిబిల్హణుఁడు రా వీడికృష్ణుఁడు తారనువదలి చంద్రుఁడు పరితపించినటుల వ్రాయఁ పద్యములవలె మనోహరములయిన పద్యము లిందుగలవు.

### ప్రశ్నఫలప్రదర్శిని రు 0-2-0

ఇందులో మనసునందలఁచుకొనిన ప్రశ్నలకు సరియయిన రములువచ్చును. ప్రశ్నలుచూడవలసిన రీతియుఁగలదు.

### లక్ష్మీనృసింహ సరసము.

లక్ష్మియు నృసింహస్వామియు సరసమాడుకొనుట చక యుండును మనమున కానందము గలుగును ముక్తినిచ్చును. 10 వారి!! 2 ప్రతులుచిలము సీయబడును

ఇందులో నొక్క ప్రతి కోనినవారికయినను 2 అణాలు పో ంఖర్చులకును పోస్టుఖర్చులు వేరుగాభరించవలెను.

కావలసిన వారు వ్రాయవలయును

శ్రీ ... దశాస్త్రి

ముక్తేశ్వరపురం సంస్థానము

జగ్గంపేట